సరస్వతీ గ్రంథమండలి

# విశ్వకథావీథి

[రెండవ సంపుటం]

పురిపండా అప్పలస్వామి
కవితా సమితి అధ్యక్షులు




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# రెండో సంపుటం పరిచయం

ప్రేమచంద్ : కథకచక్రవర్తి. హిందీ, ఉర్దూ కథకులికి గురువు. ఇండియా కథాశిల్పుల్లో ఇతడికి ప్రతిద్వంది లేడు. ఇతడి గోదాన్ నవల విశ్వసాహిత్యంలో ఉజ్జ్వలరత్నం. 'ఫాతిహా' ఫ్రెంచిడచ్చిభాషల్లోకూడా అనువాదమైంది.

పిరెండెల్లో: ఇటలీ సాహిత్యవేత్తలలో ప్రథమస్థానం లుయిజీ పిరెండెల్లోది. కథకుడిగా, ముఖ్యంగా నాటక రచయితగా ఇతడి ఖ్యాతి గొప్పది. సిసిలీప్రాంతవాతావరణం ఇతడి కథలో ప్రతిఫలిస్తుంది. భార్య పిచ్చిదై మరణించింది. సంసారికజీవితంలో సుఖపడి ఎరగడు. 'నానివాసం హోటలూ, నాఆస్తి టైపురైటరూ' అనేవాడు. నోబుల్ బహుమానమూ పొందాడు.

చెహోవ్ : రష్యాసాహిత్య మహారథుల్లోనివాడు. పుట్టుక కర్షకకుటుంబంలో. ఇరవై ఏళ్ళపుడు కలమేహాలంగా సాహితీ క్షేత్రంలో కృషిప్రారంభించాడు. కథా, నవలా, నాటకం — అన్నిటా అందెవేసిన చేయి.

చియేత్‌సూన్ : ప్రసిద్ధ చైనాకథకుడు. చైనాసాహిత్యంలో అటు కళావాదులతోనూ, 'నెలవంక' వాదులతోనూ ఇటు వాస్తవికవాదులతోనూ మెలగుతూ వచ్చాడు.

వాలెన్‌టిన్ కతాయిఎఫ్ : సోవియట్ నవ్యరచయితలలో పేరుపడ్డవాడు. ఇతడి రచనల్లో సోవియట్ మనస్తత్వం అద్దంలా కనిపిస్తుంది.

లెఫ్‌కోడియో హర్న్ : జపాను కథకుల్లో సిద్ధహస్తుడు. ఇతడి శిల్పానికి 'నర్తకీ — చిత్రకారుడూ' కథ తార్కాణం.

---

## సూచిక



---

ఆరు కథలతో మొదటి సంపుటం

ఇదివరకే అచ్చయివుంది.

# ఫాతిహా

సర్కారు వారి అనాథాలయమునుండి సరాసరి ఫౌజులో చేర్చారు నన్ను. నా శరీరం బలిష్టంగా, దృఢంగా ఉండేది. సాధారణమైన వాళ్ళకంటె నాకాళ్ళూ చేతులూ పెద్దపెద్ద నరాలతో కొంత పొడవుగా ఉండేవి. నా ఎత్తు పూరా ఆరడుగుల తొమ్మిది అంగుళాలు. పటాలంలో అందరూ నన్ను 'దేవుడు' అనేవాళ్ళు. ఫౌజులో ప్రవేశించినప్పటినుండీ నాఅదృష్టం కూడా మారుతూవచ్చింది. నేను చేసే పనుల వల్ల నాప్రతిష్ఠా, దాంతోపాటు నా ఆదాయమూ పెరుగుతూ వచ్చాయి. పటాలంలో ప్రతీ జవానుకూ నేనంటే తెలుసు. మేజర్ సర్దార్ హిమ్మత్ సింగు నన్ను ప్రత్యేకంగా దయతో చూసేవాడు. ఓసారి ఆయన్ను చావునుండి తప్పించాను. అంతే కాకుండా ఆయనంటే ఎంచేతనో భక్తిశ్రద్ధలు పుట్టుకొచ్చేవి. ఆయన్ను ఆరాధించా లనిపించేది. ఆయనకూడా నన్ను స్నేహంగా ప్రేమతో ఆదరించేవాడు.

నాతల్లిదండ్రుల సంగతే నాకు తెలీదు. వాళ్ళ స్మృతికూడ నాలోలేదు. అపుడపుడు ఈవిషయం ఆలోచిస్తూ కూచునే వాణ్ణి. లీలగా నాకేదో తోచేది. పెద్ద పెద్ద కొండలూ, వాటి మధ్య ఒకపరివారం — ఒక యువతి ముఖం, బహుశా అది మా అమ్మదై ఉంటుంది. కొండల మధ్యనే నేను పెరిగాను. పెషావరుకు తూర్పుగా 80 మైళ్ళ దూరంలో 'కులాహా'

గ్రామం ఉంది. అక్కడ సర్కారువారి అనాథాలయం ఒకటి ఉంది. అందులోనే నేను పెరిగాను. అక్కడి నుండి సరాసరి ఫౌజులోకి వెళ్ళాను. హిమాలయం వాతావరణంలో నాశరీరం పెరిగింది. సరిహద్దు ప్రాంతంలో ఉండే అఫ్రీదీ, గిల్జయీ, మహాసూదీ మొదలైన కొండజాతుల వాళ్ళలాగే నా ఆకారం పొడవుగా, మోటుగా ఉండేది. వాళ్ళకీ నాకూ ఏమన్నా తేడా, ఉందా అంటే అది ఒక్క సభ్యతలో మాత్రమే కనపడేది. ఇంతో అంతో నేను చదువుకున్నాను. కొంచెం మాటామంతీ ఆడగలను, మర్యాదగా ప్రవర్తించగలను, చిన్నా పెద్దా తెలుసుకోగలను. అంతే, కాని ఆకారంలో మాత్రం వాళ్ళకూ నాకూ భేదమేలేదు.

ఇక్కడినుండి పోయి స్వేచ్ఛగా పర్వతాల మీద తిరగాలని అపుడపుడు అనిపించేది. కాని బ్రతుకు మాట జ్ఞాపకం వచ్చి కోర్కె కోర్కెగానే ఉండి పోయేది. ఆసువ్క్రప్రదేశంలో తిండికి తికాణాయే ఉండదు. అక్కడి వాళ్లు ఒక రొట్టెముక్క కోసం ఒకమనిషిని చంపేస్తారు, ఒక్క గుడ్డముక్కకోసం శవాన్ని చీల్చి పారేస్తారు. ఒక తుపాకి కోసం సర్కారు ఫౌజుమీద బందిపోటు సాగిస్తారు. అంతేకాకుండా ఆ అడవిజాతి వాళ్ళలోని ప్రతీవ్యక్తీ నన్ను తెలిసినవాడే, నన్ను చంపాలని చూసేవాడే. వాళ్ళకు దొరికానా నా నామనిశానీలు లేకుండా అయిపోతుంది. అఫ్రీదీలను, గిల్జయీలను ఎంతమందిని నేను చంపేశానో చెప్పలేను. ఎంతమందిని పట్టుకొని సర్కారు

జైళ్ళపాలు చేసానో, వాళ్ళ ఎన్ని గ్రామాలు కాల్చి బుగ్గి చేశానో లెక్కలేదు. నేనూ ఎపుడూ అజాగ్రత్తగా ఉండలేదు. వారం కంటే ఎక్కడా అధికంగా ఉండేవాణ్ణికాదు.

## 2

ఓనాడు మేజర్ సర్దార్ హిమ్మత్ సింగు ఇంటి దిక్కు వెళుతున్నాను. మధ్యాహ్నం రెండవుతుంది. ఈరోజులు మాకు ఓమోస్తరు సెలవు దినాల్లా ఉండేవి. ఎందుకంటే, ఇప్పుడిప్పుడే కొన్ని గ్రామాలు ధ్వంసంచేసి వచ్చాం. వాళ్ళనుండి ఇంతలో మరేమీ ప్రమాదం కలిగే అనుమానం లేదు. నిశ్చింతగా, గప్పీలతోనూ, నవ్వులాటలతోనూ కాలక్షేపం చేస్తున్నాం. కూచొని కూచొని ఏమీ తోచక, సర్దార్ సాహెబ్ ఇంటి దిక్కు బయల్దేరాను. కాని, దారిలో ఒక ఘోరం జరిగిపోయింది. ఒక అఫ్రీదీ ముసలాడు – ముసలాడైనా, ఒక హిందూస్తానీ సిపాయి పీక నులిపేయడానికి తగినంత శక్తి వాడిలో ఉంది. వాడు ఒక పటాలం సిపాయి మీాదికి తల పడ్డాడు. నేను చూస్తూ ఉండగానే, ముసలాడు మొల్లోంచి దాచిన బాకును తీసి సిపాయి గుండెల్లో పొడిచేశాడు. సిపాయి దగ్గర ఒక తోటా తుపాకీ ఉంది. దాని కోసం ఈ పోట్లాట అంతాను. రెప్పపాట్లో సిపాయి పని అంతమైపోయింది. ముసలాడు తుపాకి పట్టుకు పారిపోతున్నాడు. నేను వాడి వెంటపడ్డాను. ముసలాడెంత వేగంగా

పరిగెత్తాడంటే, మాట్లాడేటంతలో కంటికి కనపడకుండా ఐపోయాడు. నేను కూడా బాణ వేగంతో వాడి వెంట పడ్డాను. చివరికి సరిహద్దు చేరీ చేరడంలో పది గజాలు దూరంలో ఉండిపోయాను. వాడు వెనక్కు చూశాడు. నేనొక్కణ్ణే వెంటబడి ఉన్నాను. తుపాకి నాదిక్కు గురి పెట్టాడు. వెంటనే నేను క్రింద పడిపోయాను. గుండు నాదగ్గర గా రాతికి తగిలింది. గుండు దెబ్బకు నాపని అయిపోయిందని వాడనుకున్నాడు. హుషారుగా అడుగులు వేసుకుంటూ, మెల్ల మెల్లగా నాదిక్కు వచ్చాడు. నేను ఊపిరి తీయకుండా పడి ఉన్నాను. బాగా దగ్గిరికి వచ్చే సరికి పెద్దపులిలాగ వాడి మీదికి ఉరికాను. మెడ పట్టుకు భూమ్మీద పడేశాను. బాకు తీసి గుండెల్లో పొడిచేశాను. ఆఫ్రీదీ ముసలాడి జీవితం అయి పోయింది. ఇంతలో పటాలం వాళ్ళు వచ్చేశారు. అందరూ నన్ను పొగడడం మొదలెట్టారు. ఇంతవరకు నాలో నేను లేను. కాని అప్పటికి చైతన్యం వచ్చింది. ఎంచేతనో చెప్ప లేను " ముసలాణ్ణి చూశాక నాహృదయం వ్యాకుల పడడం మొదలెట్టింది. ఇది వరకు ఎంతమంది ఆఫ్రీదీలనో చంపాను. కాని ఏనాడూ ఇంత సంతాపం కలగడం లేదు. నేలమీద చతికిల బడిపోయాను ; ముసలాణ్ణి చూస్తూ. నాకు దెబ్బలు తగిలాయేమో యని సిపాయిలు అనేక విధాల అడిగారు. ఏమీ మాట్లాడకుండా లేచి పట్నం దిక్కు వెళ్ళిపోవచ్చాను. ముసలాడి శవాన్ని ఈడ్చుకుంటూ సిపాయిలు నావెంటనే

వచ్చేశారు. పట్నం ప్రజలు నా జయజయ ధ్వానాలతో కోలాహలం చేశారు. నేను మాట్లాడకండా సర్దార్ హిమ్మత్ సింగు ఇంట్లోకి వెళిపోయాను.

సర్దార్ తన గదిలో ఏదో రాసుకుంటూ ఉన్నాడు. నన్ను చూసి అడిగాడు — ఏం, అఫ్రీదీని చంపేశావా ?

నేను కూర్చుంటూ చెప్పాను — జీహాఁ, కాని సర్దార్ జీ, ఎంచేతనో చెప్పలేను, నాకేదో భయంవేసిన ట్టనిపిస్తూ ఉంది.

ఆశ్చర్యపోతూ అన్నాడాయన — అసద్‌ఖాఁకి భయమా ! భయానికీ అసద్‌ఖాఁకీ సగం ఎరికకదా !

లేస్తూఅన్నాను — సర్దార్ జీ, ఇక్కడ ఎలాగో ఉంది. రండి, వరాండాలో కూచుందాం. వ్యాకులంగా ఉంది మనస్సు.

సర్దార్ లేచి దగ్గిరికి వచ్చాడు. వీపు తట్టుతూ అన్నాడు— అసద్, నువ్వు పరిగెత్తి పరిగెత్తి అలిసిపోయావు. అంతే, మరేమీ లేదు. పద, వరాండాలో కూచుందాం. చల్లగాలి సేదతీరుస్తుంది.

ఇద్దరమూ వరాండాలో కుర్చీలమీద కూచున్నాం. పట్నంలో చౌకుదగ్గర ముసలాడి శవం పడేశారు. అక్కడ జనం ఇసక వేస్తే రాలడంలేదు. వరాండాలోకి రావడం చూసి జనం నాదిక్కు చూడడం మొదలుపెట్టారు. అదిచూసి సర్దార్ అన్నాడు — అసద్‌ఖాఁ, చూడు, ప్రజలు నిన్నెంత గొప్పగా చూస్తున్నారో ! నీ వీరత్వం ఇక్కడ ఆబాలగోపాలం పొగుడుతారు. నువ్వేమో భయపడుతున్నా నంటావ్ !

చిరునవ్వుతూ అన్నాను — ఈ ముసలాణ్ణి చంపినప్పటినుండీ నామీదనాకు ఏదోలా ఉంది.

సర్దార్ నవ్వుతూ అన్నాడు — ఎంచేత నంటావ్, నీకంటే బలంలో తక్కువైన వాణ్ణి చంపావుగనక.

మనస్సు సరిపుచ్చుకుంటూ అన్నాను — బహుశా అదే ఐ ఉంటుంది.

ఇంతలో ఒక అఫ్రీదీరమణి మెల్లమెల్లగా వచ్చి సర్దార్ ఇంటి కెదురుగా నిలబడింది. చూసీ చూడ్డంతోనే సర్దార్ మొహం వెలవెల పోయింది. భయపడుతూ అతడి చూపులు ఆమె మీదినుండీ నాదిక్కు తిరిగాయి. నేనూ ఆశ్చర్యపడుతూ వాళ్ళ మొహాలు చూస్తున్నాను. ఆ యువతివంటి దృఢమైన శరీరం కలవాళ్ళు మొగాళ్ళలో కూడ తక్కువ ఉంటారు. ముదుకైన కాకీరంగు పాయజామా, నీలిరంగు కుడితినీ వేసుకుంది. శరీరం రంగు సంపంగి పువ్వులా ఉంది. యవ్వనం పిగిలి పైకి వచ్చేస్తున్నట్టుంది. ఆమె కళ్ళల్లో ఇపుడు మండుతూ ఉన్న భీషణత్వం చూస్తే ఎలాంటి వాళ్ళకైనా గుండెల్లో దడ పట్టుకుంటుంది. ఆమె కళ్లు సర్దార్ మీద నుండి నామీదికి తిరిగాయి. వాటినిచూసి నేనూ భయపడ్డాను. ఆమె సర్దారును మళ్ళీ చూసింది; నేలమీద ఉమ్మి వేసింది. తిరిగీ నన్ను చూస్తూ మరోదిక్కు వెళిపోయింది మెల్లమెల్లగా.

ఆమె వెళ్ళిపోయాక సర్దార్ ప్రాణాలు లేచి వచ్చాయి. నాతల మీంచి కూడా ఒక బరువు తగ్గిపోయినట్టైంది.

"మీరు దీన్ని ఎరుగుదురా ఏమిటి ?"

సర్దార్ పెద్ద నిట్టూర్పు విడిచి చెప్పాడు — బాగానూ, ఒకప్పుడు నన్ను ప్రాణంగా చూసేది. నిజానికి నా ప్రాణానికి తన ప్రాణం అడ్డుపెట్టింది. కాని ఇపుడు నా మొఖమంటే ఆమెకు అసహ్యం. నా భార్యను కూడా పొడిచి చంపేసింది. ఈమెను చూసేసరికి నా ప్రాణాలు పైనుండే ఎగిరిపోతాయి. ఆ భయంకర దృశ్యం నా కళ్ళముందు నాట్యం చేస్తూంది.

భయపడుతూ అన్నాను — సర్దార్‌జీ, అది నన్ను కూడా భయానకమైన చూపులు చూసింది. ఎంచేతనో చెప్పలేను. ఆపాదమస్తకం జలదరించి పోయాను.

సర్దార్ తల ఊపుతూ గంభీరంగా అన్నాడు — అసద్‌ఖాఁ నువ్వు కూడా జాగ్రత్తగా ఉండాలి. ఈ ముసలాడు ఈమెకు కావలసిన వాడై ఉంటాడేమో. బహుశా, తండ్రో, అన్నో అయి ఉండాలి. నిన్ను అలా చూడ్డంలో ఏదో అర్థం ఉండాలి. చాలా భయంకరమైన ఆడది.

సర్దారు మాటలు విని నా రోమాలు గలపొడిచాయి. మాట మారుస్తూ అన్నాను — సర్దార్‌జీ, దీన్ని పోలీసు వాళ్ళకు ఎందుకు అప్పగించకూడదు ? ఉరి తీసేద్దురే !

సర్దార్ అన్నాడు — తమ్ముడూ అసద్‌ఖాఁ, ఈమె నా ప్రాణాలు రక్షించింది. బహుశా ఇప్పుడూ ప్రేమిస్తూనే ఉంటుంది. దీని కథ చాలా ఉంది. ఎపుడన్నా తీరికగా చెబుతాను.

నాకు కుతూహలం అధికమైంది. చెప్పవలసిందని కోరాను. మొదట ఆయన తోసెయ్యాలను కున్నాడు. నేను వదల లేదు. తుదకు కాదనలేక చెప్పడం ఆరంభించాడు — అసద్, నిన్ను నాతమ్ముడిలా చూసు కుంటున్నాను. నీదగ్గర రహస్యం అట్టేపెట్టను. విను—

ఇవుడు కనపడుతూ ఉన్నట్టుగా ఐదు సంవత్సరాల క్రింద నేను ఇంత ముసలిగాలేను. అప్పటికి నాకు 40 కంటె అధికం లేవు. ఒకతలవెంట్రుకా తెల్లపడలేదు. ఇద్దరు సిపాయిలను విసరి పారేసేటంత బలం ఉండేది శరీరంలో. జర్మనీ వాళ్ళతో యుద్ధంచేశాను ; ఎంతమందిని యమలోకానికి పంపించానో లెక్కలేదు. జర్మనీ యుద్ధం తరవాత నన్ను నల్లపటాలానికి మేజర్ చేసి సరిహద్దు ప్రాంతానికి పంపించారు. వచ్చిన మొదటి దినాల్లో ఇక్కడ కష్టాలు ఎదురైనాయి. కాని వాటిని పిసరంత లెక్కచెయ్యలేదు. మెల్లమెల్లగా వాటి నన్ని టినీ జయించాను. ఇక్కడికి వచ్చాక మొదాట పష్తూ భాష నేర్చుకోవడం ఆరంభించాను. పష్తూ తరవాత మరికొన్ని భాషలూ నేర్చుకున్నాను. ఆభాషలు ధారాళంగా జాతీయా లతోకూడా మాట్లాడడం అభ్యాసమైంది. తరవాత కొందరిని జట్లుగా చేసి దేశంలోని అంతర్భాగాలను వడకట్టాను. ఆ పనిలో చచ్చిబ్రతికినంతపని అయింది. ఇన్ని కష్టాలు సయిస్తూ ఇక్కడ తుదకి సుఖజీవనం ప్రారంభించాను. ఆదినాల్లో నా చేతుల మీాద జరిగిన ఘనకార్యాల వల్ల సర్కారులో నా పేరూ

ప్రతిష్టలూ పెరిగాయి. ఓసారి కర్నల్ హామిల్టన్ భార్యను నేను ఒంటరిగా విడిపించుకు వచ్చాను. దేశీయులనూ, వారి స్త్రీలను ఎంతమందిని ప్రాణాలు కాపాడానో లెక్కలేదు. ఇక్కడికి వచ్చిన మూడేళ్ళ తరవాత నాకథ ఆరంభమౌతుంది.

ఒకనాటి రాత్రి నాక్యాంపులో పడుకొని ఉన్నాను. అఫ్రీదీలతో పోరాటం సాగుతూ ఉన్న దినాలవి. పగలంతా అలిసి పోయి సిపాయిలు ఒళ్లుమరిచి నిద్రపోతున్నారు. క్యాంపంతా నిశ్శబ్దంగా ఉంది. పక్కమీద దొర్లుతూ దొర్లుతూ నిద్రపట్టి పోయిందినాకు. మెలకువ వచ్చేసరికి చూతునూ నాగుండెల మీద ఒక అఫ్రీదీ — వయస్సు నాకంటె రెండింతలు ఉంటుంది. సవారీఅయి నాగుండెల్లోకి బాకు పొడవడానికి సిద్ధంగా ఉన్నాడు. సంపూర్ణంగా వాడి స్వాధీనంలో ఉన్నాను; తప్పించుకునే సాధనం లేదు. ఐతే, చాలా ధైర్యంతో మెలిగాను. పష్తూలో చెప్పాను — 'నన్ను చంపకు, నేను ఫౌజులో ఆఫీసర్ని, నన్ను పట్టుకు వెళిపో, సర్కారు రూపాయలిచ్చి విడిపిస్తారు.'

దేవుడి దయవల్ల నామాటలు వాడిచెవి కెక్కాయి. మొల్లోంచి తాడు తీసి నాకాళ్ళూ చేతులూ కట్టేశాడు. మూటలా నన్ను భుజంమీద వేసుకొని, డేరాబైటికివచ్చాడు. బైట పోట్లాట జోరుగా ఉంది. విచిత్రంగా అరుస్తూ ఏదో చెప్పాడు. నన్నుభుజంమీదే వేసుకొని అడివిమార్గం పట్టాడు. నాబరువు వాడికో లెక్కలో ఉన్నట్టు కనపడలేదు. జోరుగా

పారిపోతూ ఉన్నాడు. వాడి వెనకాలే కొంతమంది, వాళ్ళ గుంపులో వాళ్ళే, పోట్లాటలో దోచుకున్న సామగ్రి మోసుకుంటూ వచ్చేస్తున్నారు.

తెల్లవారేటప్పటికి ఒక చెరువు దగ్గిరికి వచ్చాం. చుట్టూ పెద్ద పెద్ద పర్వతాలూ, మధ్యని ఉంది చెరువు. అతి నిర్మలంగా ఉన్నాయి నీళ్ళు. అక్కడక్కడ అడివి చెట్లు మొలిచి పెరుగుతున్నాయి. చెరువు దగ్గర అందరమూ ఆగాము. ముసలాడు — నిజానికి వాడే ఆగుంపు సర్దారు, నన్ను ఒక రాతి బండమీద కుదవేశాడు. నా నడుం విరిగిపోయినంత ఐంది. దైవకృపవల్ల ఎక్కడా ఎముకలు విరగలేదు మాత్రం. నన్ను క్రింద పడేసి అన్నాడు — 'ఏం ఎన్ని రూపాయలిస్తావ్ !'

నొప్పిసయిస్తూ అన్నాను. 'ఐదు వందలు'

వాడు మొహం చిట్లిస్తూ అన్నాడు. వీల్లేదు, ఇంత తక్కువ పుచ్చుకొనేది లేదు. రెండు వేలుకి ఓ దమ్మిడీ తక్కువయిందా అంటే నీప్రాణం దక్కదు.

కొంచెం ఆలోచించి చెప్పాను— 'వల్లవాళ్ళకోసం సర్కారు అన్ని రూపాయలు ఖర్చు పెట్టరు.'

ముసలాడు బాకు పైకితీసాడు — 'ఐతే సర్కార్ ఇనాం ఇస్తారని ఎందుకు చెప్పావ్ ? ఇదిగో ఐతే ఇక్కడే చవ్వు.'

బాకు పైకెత్తి నామీదికి వస్తున్నాడు. నేను గాభరాపడి పోతూ అన్నాను — 'అచ్ఛా, సర్దార్, రెండు వేలూ ఇప్పిస్తాను.'

ముసలాడు ఆగాడు. పెద్దపెట్టున నవ్వాడు. నిర్జీవమైన కొండల్ని కూడా వణికించింది వాడినవ్వు. 'ఎంత ఘోరమైన మనిషిరా బాబూ' అనుకున్నాను.

దోచుకు తెచ్చినవస్తువులన్నీ సర్దారు ఎదట కుప్పపోశారు. తుపాకులూ, తోటాలూ, టోపీలూ, బట్టలూ కుప్పబడ్డాయి. నన్ను కూడా పరీక్షచేశారు. నాదగ్గర ఆరుగుళ్ళ పిస్తోలు దొరికింది. పిస్తోలు పుచ్చుకొని ముసలాడు పొంగిపోయాడు. దాన్ని ఇటూ అటూ త్రిప్పడం మొదలు పెట్టాడు. అక్కడే వాళ్ళు వంతులు వంచేసుకున్నారు. వంతులు సమానంగా ఉంచారు. కాని నాపిస్తోలు, వాట్లో చేర్చలేదు. అది ముసలాడి స్వంతం.

కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్నాక మళ్ళీ ప్రయాణం ఆరంభమైంది. ఈసారి నా కాళ్ళకట్లువిప్పేశారు; నడవమన్నారు. దారి తెలుసుకోకుండా ఉండడం కోసం కళ్ళకు పట్టీవేసి కట్టేశారు. రెండు చేతులకూ త్రాడు కట్టి దాని కొన ఒక అఫ్రీదీ పట్టుకు నడిచాడు.

నడిచి నడిచి నా కాళ్ళు నొప్పులు పెట్టాయి; కాని మజిలీ పూర్తికాలేదు. జ్యేష్ఠమాసం సూర్యుడు తలమీద మండి పోతూ ఉన్నాడు. కాళ్ళు మాడి పోతూ ఉన్నాయి. దాహంతో గొంతుక ఆర్చుకు పోతూ ఉంది. ఐనా వాళ్ళు నడుస్తూనే ఉన్నారు. వాళ్ళలో వాళ్లు మాట్లాడుకుంటూనే ఉన్నారు, కాని ఒక మాటా నాకు అర్థం కాదు. అక్కడ

క్కడ ఏదో కొంచెం తెలిసేది, అంతే. మరేమీ బోధపడేది కాదు. వాళ్ళకు కలిగిన విజయానికి ఆనందంగా ఉన్నారు వాళ్ళు. ఒక అఫ్రీదీ తమ భాషలో ఒకపాటకూడా మొదలెట్టాడు. పాట ఎంతో బావుంది. జ్ఞాపకం ఉంది, పాట భావం ఇది.

ఒక అఫ్రీదీ ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాడు, అతడి భార్య అంటుంది. 'ఎక్కడికి వెళతావు?' యువకుడు జవాబు చెపుతాడు – 'వెళుతున్నాను. నీ కోసం రొట్టే, బట్టలూ తేవడంకోసం' భార్య అంటుంది – 'మరి, మన పిల్లల కోసం ఏమీతేవూ?'

యువకుడు అంటాడు – 'అబ్బాయికోసం తుపాకి తెస్తా. పెద్ద వాడయాక వాడూ పోట్లాడుతాడు. వాడి ప్రియురాలికోసం రొట్టే, బట్టలూ తెస్తాడు.'

భార్య అంటుంది – 'ఐతే చెప్పు ఎప్పుడువస్తావ్? యువకుడు అంటాడు – 'గెలుచుకు వస్తే వస్తాను. లేదా అక్కడ చస్తాను.' భార్య అంటుంది – 'సెబాష్, వెళ్లు, వీరుడివి నువ్వు. తప్పక గెలుచుకు వస్తావు.'

పాట విని నేను ముగ్ధుడనై పోయాను. పాట పూర్తయింది మేమూ ఆగాం. నాకళ్లు విప్పేశారు. ఎదురుగుండా పెద్ద మైదానం. చుట్టూ తయారు చేసిన గుహాలు. అవే వాళ్ళ నివేశనాలు.

మళ్ళీ నన్ను పరీక్ష చేశారు. ఈసారి నాదుస్తులన్నీ తీసేశారు. కేవలం పాయిజామా మాత్రం ఉండిపోయింది. ఎదట పెద్ద బండరాయిఉంది. అందరూ కలిసి దాన్ని తొలిగించారు. నన్ను అక్కడికి తీసుకు వెళ్ళారు. నాప్రాణాలు నిలువునా

ఎగిరిపోతున్నాయి. ఇది బ్రతికి ఉండగానే పాతిపెట్టెయ్యడం అన్నమాట. వేదనాపూర్ణదృష్టితో సర్దార్‌తో చెప్పాను — 'సర్దార్! సర్కారు నీకు రూపాయలిస్తారు. నన్ను చంపవద్దు.'

సర్దార్ నవ్వుతూ అన్నాడు — నిన్నెవళ్లు చంపేస్తున్నారనీ! ఖైదుచేస్తున్నాం. ఈఇంట్లో బందీగా ఉంటావు. రూపాయలు రాగానే వదిలేస్తా.'

ప్రాణం కొంచెం కుదుటబడింది. నాపోకెట్ పుస్తకం, పెన్సిలూ నాఎదుట పెడుతూ అన్నాడు 'ఇదిగో, దీనిమీద రాసేయ్, ఒక్క దమ్మిడీ తక్కువగా వచ్చిందా నీప్రాణం దక్కదు.

కమీషనర్ సాహెబ్ పేర ఒక ఉత్తరం రాసి ఇచ్చాను. నన్ను ఆ అంధకూపంలోకి దించేసి, రాయి పైన కప్పేశారు.

## 4

హిమ్మత్ సింగ్ నిట్టూర్పు విడిచాడు. మళ్లీ చెప్పడం ఆరంభించాడు—

అసద్ ఖాం, ఆనూతిలోకి నన్ను దించేస్తూ ఉన్నపుడు నా బొందిలో ప్రాణాలు లేవు. లోపల గాఢాంధకారానికి బదులు పల్చటి వెన్నెలలా ఉంది. లోపల గుహ అంత పెద్దదీ కాదు, అంతచిన్నదీకాదు. అడుగున అంతా కరుకుగా ఉంది. సంవత్సరాల తరబడి నీళ్ళు ప్రవహించి గొయ్యిగా తయారైనట్టుంది. చుట్టూ దళసరి రాతిగోడ నుయ్యిలా ఉంది.

గోడలో అక్కడక్కడ రంధ్రాలున్నాయి. వాటిలో నుండి వస్తూ ఉంటుంది గాలీ, వెల్తురూ. క్రింద చేరి నాదుర్దశను తల పోశాను. గుండెలు కొట్టుకుంటూ ఉన్నాయి. ఈ చీకటి కూపంలో పడి బాధ పడమని బ్రహ్మ రాసి పెట్టాడు.

క్రమంగా సాయంకాలం కావచ్చింది. ఇంత వరకూ నా ఊసే తలపెట్టేవాళ్ళు లేరు. ఆకలి దహించుకు పోతూ ఉంది. మాటి మాటికీ నా అదృష్టాన్ని తిట్టుకుంటూ ఉన్నాను. మరో ఉపాయం లేనప్పుడు అదృష్టాన్నే తిట్టుకుంటాడు మనిషి.

చివరికి ఒక కన్నం లోంచి పెద్దపెద్దరొట్టెలు నాలుగు ఎవరో వేశారు. రొట్టెముక్కకోసం కుక్క పరిగెత్తేటట్టు, నేను పరిగెత్తాను. రొట్టెలు తీసుకొని ఆ రంధ్రం దిక్కు చూశాను. ఎవరూ మరేమీ వేయలేదు. ఏమీ చెప్పనూ లేదు. కూచొని రొట్టెలు తింటున్నాను. ఇంతలో ఆ రంధ్రం లోనే ఒక ఇనప గిన్నితో నీళ్లు ఉంచబడ్డాయి. దేవుణ్ణి మొక్కు కుంటూ, తీసుకు త్రాగేశాను. కొంచం ప్రాణం చల్లబడింది. 'మరికొంచెం నీళ్లు కావాలి' అన్నాను.

దాంతో గోడ అవతల ఒక భయంకరమైన నవ్వు ప్రతిధ్వ నించింది. ఎవరో కణ కణ మనే గొంతుకతో అన్నారు—'నీళ్ళు మళ్ళీ రేపు దొరుకుతాయి. గిన్నె ఇచ్చెయ్యి. లేకపోతే రేపూ నీళ్లు దొరకవు.

ఏం చెయ్యనూ, గిన్నె అక్కడే పెట్టేశాను.

ఈవిధంగా కొన్నిరోజులు గడిచాయి. ప్రతీదినం నాలుగు

రొట్టెలూ, గిన్నెడు నీళ్ళూ లభించేవి. క్రమ క్రమంగా నేనూ ఈశుష్క జీవనానికి అలవాటు పడ్డాను. ఏకాంతవాసం అంత బాధించేదికాదు. అప్పుడప్పుడు నాభాషలోనూ పష్తూ లోనూ పాటలు పాడేవాణ్ణి. దాంతో కొంచెం ఊసుపోయేది. హృదయం తేలిక ఐనట్లయేది.

ఒకనాటి రాత్రి పష్తూ గీతం ఒకటి పాడుతున్నాను—

కుములుతూ ఉన్న మేఘాలతో మజానూ
అంటున్నారు-పాంథజనాన్ని కాల్చిబుగ్గి
చేసే అగ్ని నీలో లేదా? ఇంతకూ ఆ అగ్ని
నన్నెందుకు కాల్చదూ? నాలోకూడ ఒక జ్వాల
మండుతూ ఉందనా?
ఇదిగో, లైలా వెదుక్కుంటూ ఇక్కడికి
వచ్చినప్పుడు నాశరీరం ఇసకతో కప్పె
య్యాలి. లేకపోతే గాజువంటి లైలా
హృదయం బ్రద్దలై పోతుంది.

నేను పాట ఆపేశాను. ఇంతలో రంధ్రంలోనుండి ఎవరో అన్నారు— 'ఖైదీ, ఏదీ మళ్ళీపాడూ!'

త్రుళ్ళిపడ్డాను. కొంచెం సంతోషమూ కలిగించింది, ఆశ్చర్యం కూడాను. అడిగాను—'ఎవరు మీరు?'

అదే రంధ్రంనుండి జవాబు వచ్చింది నేనూ తూరయాను, సర్దార్ కూతుర్ని.

నేను అడిగాను — 'పాట నచ్చిందా?'

తూరయా జవాబు చెప్పింది – 'అవును, ఖైదీ, మళ్ళీ పాడూ వింటాను.

హుషారీగా పాడడం మొదలు పెట్టాను. పాట ముగిసిన తరవాత తూరయా అంది –, 'రోజూ ఈపాట పాడుతూ ఉండు. దీనికోసం నీకు మరిన్ని రొట్టెలూ నీళ్ళూ ఇస్తాను.

తూరయా వెళ్ళిపోయింది. అవాళనుండీ ప్రతీరాత్రీ ఆపాట పాడేవాణ్ణి. తూరయా ప్రతీసారీ గోడప్రక్కని వచ్చి వినేది.

నాకాలక్షేపానికి ఇదొక అవకాశం కలిగింది. క్రమంగా ఒక నెల గడిచిపోయింది. కాని, నన్ను విడిపించిందికి ఎవళ్ళూ రూపాయలు పంపలేదు. దినాలు గడిచిన కొద్దీ బ్రతుకు మీద ఆశ దూరం అవుతూఉంది.

సరిగా నెలగడిచిన తరవాత సర్దారు వచ్చి అన్నాడు – 'రేపటిలోగా రూపాయలు రాకపోతే నిన్ను చంపేస్తాను. ఇక రొట్టెలు మేపలేను.'

ప్రాణం మీాద నాకు మరి ఏ ఆశాలేదు. దినమంతా నే నేమీా తిననూలేదు, నీళ్ళయినా త్రాగలేదు. రాత్రి పడింది. మళ్ళీ రొట్టెలు లోపల పడ్డాయి. కాని, తినేందుకు మనస్క రించలేదు.

వేళకు తూరయా వచ్చి అన్నది – 'ఖైదీ పాట పాడూ!'

నాకేమీా బాఫుండలేదు. నేను మాటాడలేదు.

తూరయా మళ్ళీ అంది – 'ఖైదీ నిద్రబోయావా?'

నేను మలిన స్వరంతో అన్నాను – 'లేదు. ఇవాళనుండీ

నిద్రపోయి ఏం చెయ్యనూ! రేపు పెద్దనిద్రే పోతాను. మరి లేవనే అక్కరలేదు.'

తూరయా ప్రశ్నించింది – 'ఏం, సర్కారు రూపాయలు పంపించరా?'

నేను చెప్పాను – 'తప్పకుండా పంపిస్తారు. కాని రేపు నన్ను చంపేస్తారుకదా! నేను చచ్చిపోయాక రూపాయలు వచ్చాయే అనుకో, నాకేం లాభం?'

తూరయా ఓదారుస్తూ అంది – 'అచ్ఛా, నువ్వు పాట పాడు, రేపు నిన్ను చంపకుండా చేస్తాను.'

నేను పాట పాడాను. వెళిపోయేటప్పుడు తూరయా అడిగింది 'బోనులో ఉండిందికి ఇష్టపడతావా?'

సంతోషంగా అన్నాను – 'ఓ, ఎలాఅయినా ఈనరకం నుండి బైటపడితేచాలు.'

తూరయా అంది – 'రేపు నాన్నతో చెపుతాను.'

మర్నాడు అంధకూపం నుండి నన్ను బైటకు తీశారు. లావాటి కర్రలరంధ్రాలలో నాకెండు కాళ్ళూ పెట్టి బంధించారు. వాటిని కొయ్యలువేసి గోతుల్లో బిగించారు.

సర్కారు వచ్చి చెప్పాడు – 'ఖైదీ, మరి పదిహేను రోజులు గడువు ఇస్తున్నాను నీకు. ఆ తరవాత తలకాయ మొండెంనుండి వేరు చేసేస్తాను. ఇవాళ పరో ఉత్తరం రాయి. ఈద్ నరికి రూపాయలు రాకపోయినట్లాయెనా, అవాళ నిన్నే హలాల్ చేసేస్తాను.'

మరో ఉత్తరం రాసి ఇచ్చాను.

మునలాడు వెళ్ళాక తూరయా వచ్చింది. తూరయా అంటే ఇపుడు వచ్చిన అమ్మాయే; సర్దారు కూతురు. ఈమె నాపాట వింటూఉండేది. సిఫార్సుచేసి నాప్రాణాలు కాపాడింది.

తూరయా నన్ను చూడడం మొదలు పెట్టింది. నేనూ ఆమెను చూశాను.

అడిగింది — 'ఖైదీ, నీయింటికి దగ్గర ఎవరెవరున్నారు?'

జాలిగా చెప్పాను — 'చిన్న చిన్న పిల్లలు మాత్రం ఇద్దరు ఉన్నారు. మరెవ్వరూ లేరు!

నాకు తెలుసు ఆఫ్రీదీలకు పిల్లలంటే ప్రాణం.

తూరయా అడిగింది—' వాళ్ళ అమ్మలేదూ?

కేవలం ఆమె దయ సంపాదించాలన్న ఉద్దేశంతో చెప్పాను—' లేదు, చచ్చిపోయింది. వాళ్ళు ఒంటరిగానే ఉన్నారు. చచ్చిపోయారో బ్రతికేఉన్నారో తెలీదు. ఏమంటే నేను తప్పవాళ్ళను చూసేవాళ్ళేలేరు.'

నాకళ్ళంబడి నీళ్ళు వచ్చేశాయి. ఆమె కళ్ళుకూడా చెమ్మగిల్లాయి. ఉద్వేగం ఆపుకొంటూ అంది—' ఐతే నీకెవల్లూ లేరన్నమాట. పిల్లలుమాత్రం ఉన్నారు! పాపం, వాళ్ళు ఏడుస్తూ ఉంటారు!

లోలోపల సంతోషిస్తూఅన్నాను— 'అవును, తప్పకుండా ఏడుస్తూ ఉంటారు. ఏమో చచ్చిపోయే ఉంటారేమో, ఎవరికి తెలుసు!'

మాటకి అడ్డువచ్చి తూరయా అంది — ‘ ఊఁ హాఁ, చచ్చి పోయిఉండరు. అచ్ఛా, మీఇల్లు ఎక్కడో చెప్పు, నేను కను క్కొని వస్తాను. ’

నాఇంటి పత్తా చెప్పాను. ఆమెఅంది— ‘ ఆ స్థలానికి అనేక సార్లు వెళ్ళాను. బజారికి ఎప్పుడూ ఆదారినే వెళుతూ ఉంటాను. నీపిల్లల సంగతి తెలుసుకు వస్తాను ’.

సందేహిస్తూ అడిగాను—‘ ఎప్పుడు వెళతావు.’

కొంచెం ఆలోచించి చెప్పింది— ‘ శుక్రవారం వెళతాను. అచ్ఛా, ఖైదీ, నువ్వు అపాట పాడూ.’

మంచి హెక్కారీగా పాట ప్రారంభించాను. తూరయా మీద పాట ఎలాంటి ప్రభావం వేస్తూ ఉందీ ఇవాళచూశాను. ఆమె శరీరం వణికింది. కళ్ళనీళ్లు తొణికాయి. చెక్కిళ్లు పాలి పోయాయి. వణుకుతూ చతికిల బడి పోయింది. ఆమె స్థితి చూసి మరింత ఉత్సాహంగా పాడాను. చివర్ని అన్నాను— ‘ తూరయా ’ నేను చచ్చిపోయేట్లయితే నాపిల్లలకు నాకబురు అందించాలి. ’

నామాటలు బాగా పనిచేశాయి. తూరయా గద్గదికతో అంది—‘ ఖైదీ, నువ్వుచావ నక్కఅలేదు. నీపిల్లలకోసం నిన్ను వదిలేస్తాను. ’

నిరాశగా అన్నాను— ‘ తూరయా, నువ్వు వదిలేసినా నేను బ్రతకడం కష్టం. ఈ అరణ్యంలో తిరిగి తిరిగి చచ్చిపోతాను.

అంతే కాకుండా నీమీద ఆపదకూడా రావచ్చు. నా ప్రాణం కోసం నిన్ను కష్టాల్లో త్రోసెయ్యలేను.

తూరయూఅంది-'నాకోసం విచారించకు, నన్నెవ్వరూ అనుమానించరు. నేను సర్దారు కూతుర్ని. నేను ఏదంటే అదే అవుతుంది. కాని, నువ్వు వెళ్ళేక రూపాయలు పంపేస్తావా!'

సంతోషంతో అన్నాను – 'తప్పక పంపిస్తాను.'

తూరయూ అంది—'ఐతే నిన్ను వదిలేస్తాను.'

ఇదయ్యాక తూరయూ ఎల్లప్పుడూ నాపిల్లలగురించే మాట్లాడేది. అసద్ ఖాఁ, అఫ్రీదీలు పిల్లలంటే నిజంగా ప్రాణం పెడతారు. భగవంతుడు వాళ్ళను ఇంత ఘోరమైన జంతువులుగా చేశాడు, అయితేనేం, వాళ్ళలో మానవహృదయం లేకపోలేదు. చివరికి శుక్రవారం వచ్చింది. కాని ముసలాడింత వరకూ తిరిగి రాలేదు. వాళ్ళ గుంపునుండీ ఎవళ్ళూ రాలేదు. అవాళసాయంకాలం తూరయూ వచ్చి చెప్పింది—'కైదీ, నేను ఇవాళ వెళ్ళలేను. ఏమంటే మానాన్న ఇంతవరకూ రాలేదు. రేపుకూడా రాకపోతే, నిన్ను రాత్రికి వదిలేస్తాను. నువ్వు పిల్లల దగ్గిరికి వెళ్ళు. కాని, రూపాయలు పంపడంమాత్రం మరిచిపోవద్దు. నిన్ను నమ్ముతున్నాను.'

అవాళనురింత ఉత్సాహంతో పాట పాడాను. అర్ధరాత్రి వరకూ తూరయూ వింటూ ఉంది; తరవాత పడుకుందికి వెళ్ళిపోయింది. మర్నాడుకూడా సర్దార్ రాకుండా ఉండాలని భగవంతుణ్ణి వెయ్యిమొక్కులు మొక్కాను. బోనులో కట్టి

పడేయడం వల్ల నాకాళ్ళు బొత్తిగా పనికిరానట్టయిపోయి నాయి. ఈశరీరమంతా పులిసిపోయినట్టుంది. ఇంతకంటే ఆచీకటి కూపమే నయంగా ఉండేది; కాళ్లు చేతులు కదప డానికైనా వీలుండేది.

మర్నాడు కూడా ముసలాడు రాలేదు. అవాళ తూరయా విచారంగా ఉంది. సాయంకాలం వచ్చి నాకాళ్ళబంధాలు విప్పేసి అంది — 'ఇకనువ్వు వెళ్ళవచ్చు. పద, కొంతదూరం దిగబెట్టి వచ్చేస్తాను.'

కొంతసేపటి దాకా కదలలేక పోయాను. మెల్ల మెల్లగా నాకాళ్లు సాగాయి. దేవుణ్ణి మొక్కుకుంటూ తూరయా వెంట బయల్దేరాను.

ఆమెను సంతోష పెట్టడం కోసం దారికడాకూ పాట పాడుతూ వచ్చాను. తూరయా మాటిమాటికీ వినేది; మాటిమాటికీ ఏడ్చేది. సుమారు అర్ధరాత్రికి చెరువు దగ్గిరికి వచ్చాం. అక్కడికి వచ్చేక తూరయా అంది — 'తిన్నగా వెళిపో, పెషావరు చేరుకుంటావు. ఇదిగో, జాగ్రత్తగా వెళ్ళు. లేకపోతే ఎవరి గుండైనా వచ్చి నీపని అంతమైపోతుంది. ఇవిగో, నీబట్టలు తీసుకో. కాని, రూపాయలు తప్పక పంపాలి సుమా! నీకు జామీనుగా నేను ఉంటాను. రూపాయలు రాకపోతే నాప్రాణం పోతుంది, నీప్రాణమూ దక్కదు. రూపాయలు వచ్చేశాయా అంటే అఫ్రీదీ అన్నవాడు ఎవడూ నీమీద చెయ్యి చేసుకోడు. ఓసారి నువ్వు ఒక అఫ్రీదీని

చంపేశావనుకో, అయినా నిన్నెవడూ ఏమీ అనడు. వెళ్ళు దేవుడు నీకు మేలు చేస్తాడు; నీపిల్లలతో నిన్ను చేరుస్తాడు'

తురయా మరి ఆగలేదు. గుణుగుణు అనుకుంటూ వెళ్ళిపోయింది. అర్ధరాత్రి దాటిపోయింది. చుట్టూ భయంకరమైన నిశ్శబ్దం. కేవలం గాలి రైఁ రైఁ మని వీస్తూ ఉంది. ఆకాశం నడినెత్తిని చందమామ పదహారు కళలతోటి వెలిగిపోతూ ఉన్నాడు. చెరువుదగ్గిర ఆగడం క్షేమం కాదు. మెల్లమెల్లగా దక్షిణం దిక్కు బయల్దేరాను. మాటిమాటికీ చుట్టూ చూస్తూ ఉండేవాణ్ణి. దేవుడిదయవల్ల తెలతెలవారుతూ ఉండగా పెషావరు సరిహద్దు చేరుకున్నాడు.

సరిహద్దులో సిపాయిల పహారా ఉంది. నన్ను చూడ్డంతోనే ఫౌజుఫౌజంతా పరిగెత్తుకు వచ్చారు. నేను చచ్చిపోయాననే వాళ్ళు అనుకున్నారు. బ్రతికిరావడం చూసి అంతా సంతోషించారు.

కర్నల్ హామిల్టన్‌సాహెబ్ కూడా కబురు విని వెంటనే బయల్దేరి వచ్చాడు. సంగతంతా విని అన్నాడు — 'మేజర్ సాహెబ్, మీరు చచ్చిపోయారనే అనుకున్నాను. నాదగ్గిరికి మీఉత్తరాలు రెండువచ్చాయి. ఐతే అవి మీరే రాశారని కల్లోకూడా నమ్మలేదు నేను. ఫోర్జరీ ఉత్తరాలనే అనుకున్నాను. మీరు బ్రతికివచ్చారు, భగవంతుడికి ధన్యవాదాలు'

కర్నల్ సాహెబ్‌కు నమస్కారం చేశాను. మనస్సులో అనుకున్నాను—' నల్లవాళ్ళ ఉత్తరాలైతే ఫోర్జరీ, అదే ఒక తెల్ల

వాడురాసి ఉంటే, రెండువేలేమిటి నాల్గువేలు అయినా వెళ్లి పోయి ఉండేవి. ఎన్ని ఊళ్లు తగల బెట్టెయ్యడంలేదు ? మరి ఏదిమాత్రం కాకుండా ఉందిగనక !'

మాటాడకుండా ఇంటికి వచ్చాను. పెళ్లాం పిల్లల్ని చూసి మనస్సు కుదుటబడింది. ఆదినమే నమ్మకమైన ఒక నౌకరుచేత రెండు వేల రూపాయలూ తూరయా దగ్గిరికి పంపేశాను.

## 5

సర్దార్ ఒకనిట్టూర్పు విడిచి చెప్పాడు — అసద్‌ఖాఁ, ఇంతతో నాకథ పూర్తికాలేదు. దుఃఖాంతమైన భాగం ఇంకా మిగిలే ఉంది. ఇక్కడికి వచ్చేశాక క్రమంగా నాకష్టాలు మరచిపోయాను. కాని, తూరయాను మాత్రం మరవలేక పోయాను. తూరయా దయవల్లనే నాపెళ్ళాం బిడ్డల్ని కలిశాను అంతేనా, ప్రాణదానం కూడా పొందాను. అలాంటప్పుడు ఆమెను ఎలా మరిచిపోవడం ?

నెలలు గడిచాయి, సంవత్సరాలు గడిచాయి. తూరయాను గాని, ఆమెతండ్రినిగాని మరి చూడలేదు. తూరయా వస్తాననీ చెప్పింది. కాని, రాలేదు. అక్కడనుండి వచ్చేక నా భార్యను పుట్టింటికి పంపేశాను ; తూరయా వస్తుందేమోఅనే. వచ్చిందంటే అబద్ధం ఆడినవాణ్ణాయి పోతాను మరి. కాని మూడేళ్లు గడిచాయి. తూరయా రాలేదు. అంచేత నాకు ఆ భయం పోయింది. మాఆవిడిని పుట్టింటినుండి తీసుకువచ్చేశాను. మేం

సుఖంగా దినాలు గడుపుకుంటూ ఉన్నాం. ఇంతలో దుర దృష్టం ఘడియలు వచ్చిపడ్డాయి.

ఒకనాటి సాయంకాలం ఇదే వరండాలో కూచొని నా భార్యతో మాట్లాడుతున్నాను. ఎవరోవచ్చి తలుపుతట్టారు. నౌకరు ద్వారం తెరచాడు. జంకూ గొంకూ లేకుండా ఒక కాబోలీ యువతి మెట్లెక్కి మీాదికి వచ్చేసింది. పైకివచ్చి విశుద్ధమైన పష్తూభాషలో అడిగింది –

'సర్దార్‌సాహెబ్ ఉన్నారా ?'

నేను ఇవతలికి వచ్చి అడిగాను – 'ఎవరునువ్వు ? ఏమిటి కావాలి ?'

కొన్నిపగడాలు పైకితీస్తూఅంది – 'ఈపగడాలు అమ్మేం దికి వచ్చాను, కొంటారా ?'

ఇలా అంటూ పెద్దపెద్దపగడాలు బైటికితీసి నాబల్లమీాద పెట్టింది.

నావెంట నాభార్యకూడ బైటికివచ్చింది, పగడాలు చూడ డం మొదలుపెట్టింది. కాబూల్‌పిల్ల అడిగింది – 'సర్దార్ సాహెబ్, ఈవిడెవరు ? మీాఆవిడా ?'

నేను చెప్పాను – 'అవును, మాఆవిడ కాకపోతే మరెవ రను కున్నావ్ !'

కాబూలీ యువతి అంది – 'మీాభార్య చచ్చిపోయింది కదా ! మళ్ళీరెండో పెళ్ళి చేసుకున్నారా ?'

కోపంగా అన్నాను – 'చుప్, బేవకూఫ్, నోరుముయ్, నువ్వు చచ్చి ఉంటావు.

నా భార్యకు పష్తూ తెలీదు. అదేధ్యానంగా పగడాలు చూస్తూఉంది.

ఎంచేతనో తెలీదు. నామాటలు విని కాబూలీ అమ్మాయి కళ్ళు మెరిశాయి. మరింతతీవ్రంగా అంది. – ఆఁ, బేవకూఫ్ను కాకపోతే నిన్ను వదిలి పెట్టేస్తానా ? దోజ్ కీపిల్లె, నాతో అబద్ధం చెప్పావ్, ఇదిగో, అప్పుడు చవ్వకపోతే ఇప్పుడు చచ్చింది.'

అంటూనే పెద్దపెద్దపులిలాగు ఉరికింది, నాభార్యగుండెల్లో కాకుతో పొడిచేసింది. అడ్డుపడ్డానికి నేను పరిగెత్తాను. ఒక్క గంతేసి వాకిట్లోవెళ్ళిపోయి అంది. – ఇప్పుడు తెలిసిందా ? నేను తూరయాను. నీఇంట్లోఉండిందికి ఇవాళ వచ్చాను. నిన్ను పెళ్ళాడి నీదాన్నై ఉండేదాన్ని. నీకోసం తండ్రినీ, ఇంటినీ అన్నిటినీ వదిలేశాను. కాని నువ్వు అబద్ధాలకోరువి. మోస గాడివి. ఇవాళనుండి నీపెళ్ళాంకోసం మొత్తుకో, నేను నీకోసం ఏడుస్తాను.

ఇలాఅంటూ జోరుగా క్రిందికి వెళ్ళిపోయింది. నాభార్య దగ్గిరికి వెళ్ళి చూశాను. బాకుసరిగ్గా హృదయంలో దూసుకు పోయింది. ఒకేపోటుతో ఆమెపని అయిపోయింది.

చెపుతూ చెపుతూ సర్దార్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కళ్ళు తుడుచుకుంటూ చెప్పాడు – అసద్ ఖాఁ, నేను కల్లోకూడా

అనుకోలేదు, తూరయాలో ఇలాంటి పిశాచ హృదయం ఉంటుందని. రాగానే పోల్చుకోగలిగిఉంటే ఈఆపదవచ్చేది కాదు. మనసు చీకటిగా ఉంది. అంతేకాక ఆమె వస్తుందన్న ఆశే ఉండేదికాదు, నాకు.

అప్పటినుండి తూరయా మరి రాలేదు. ఇప్పుడెప్పుడైనా నన్ను చూసిందా అంటే నాగుబాములాగు బుసకొడుతూ వెళ్ళిపోతుంది. ఆమెను చూసేసరికి నాగుండెల్లో కంపం పట్టుకుంటుంది. నేను ఏదో ఐపోతాను. పట్టించేస్తానూ అని అనేకసార్లు అనుకుంటాను. కాని ఆమెను చూసేసరికి మతి పోతుంది; కరచరణాలాడవు. పిరికివాణ్ణయి పోతాను.

అదీకాకుండా ఒవాలుశా ఇప్పటికీ నన్ను ప్రేమిస్తూనే ఉంటుంది. నా పిల్లలకు ఏవైనా విలువైనవస్తువులు ఇస్తూనే ఉంటుంది. పిల్లలు ఆమెకు కనపడనిదినం వాళ్ళింట్లోకి ఓకాగితం ముక్క కట్టి 'సర్దారుగారి పిల్లలకోసం' అని రాసి పడేస్తుంది.

ఇంతవరకూ ఈమెను అర్థంచేసుకోలేక పోయాను. అర్థం చేసుకోవడానికి ఎంతప్రయత్నిస్తానో అంత జటిలంగా కనిపిస్తుంది. మనిషో, రాక్షసో అర్థంకాదు.

ఇంతలో సర్దార్ పెద్దకొడుకువచ్చి చెప్పాడు — 'నాన్నా, ఇదిగో ఆవిడ ఈబంగారం తావీజు ఇచ్చింది.'

సర్దార్ నన్నుచూసి అన్నాడు — చూడు, అసద్‌ఖాం, నేను చెప్పలేదూ, ఇవాళకూడ ఈతావీజు ఇచ్చి వెళ్ళింది.

ఎన్ని వస్తువులు, ఎన్ని తావీజులు, ఇలాగే అర్జున్‌కీ, నిహార్‌కీ ఇచ్చిందో చెప్పలేను. తూరయా నిజంగా చిత్రమైన ఆడది.

## 6

సర్దార్ సాహెబు దగ్గిర సెలవు తీసుకొని ఇంటికి బయల్దేరాను. చౌకునుండి ముసలాడి శవం తీసుకు వెళ్ళిపోయారు. ఐనా, అక్కడికి వెళ్ళేసరికి నా ఒళ్ళు జలదరించింది. అప్రయత్నంగా ఒక నిమిషం ఆగిపోయాను. వెనక్కు తిరిగి చూశాను, నీడవలె ఒక స్త్రీ నా వెంటపడి వస్తూ ఉంది. నేను ఆగడం చూసి అదీ ఆగి పోయింది; ఒక దుకాణంలో ఏదో బేరం చేయడం మొదలు పెట్టింది.

నా హృదయాన్ని ప్రశ్నించాను — 'ఇది తూరయా కాదు కదా?'

హృదయం జవాబు చెప్పింది — 'ఆఁ, బహుశా అదే ఐ ఉంటుంది.'

'తూరయా నా వెంట ఎందుకు పడింది చెప్మా!' అనుకుంటూ నే ఇంటికి వచ్చేశాను. భోజనం చేసి పడుకున్నాను. కాని, ఇవాళ జరిగిన విషయాల ప్రభావం నామీద ఎంత పడిందంటే, ఎంత ప్రయత్నించినా నిద్దర రావడంలేదు. నేను ఎంత ప్రయత్నిస్తానో నిద్ర అంత దూరంగా పోతుంది.

పటాలం గంట పన్నెండు కొట్టింది, ఒకటి కొట్టింది, రెండు కొట్టింది, నాకు నిద్రమాత్రం రాలేదు. పక్కలు మార్చ

కుంటూ నిద్రకోసం ఉపక్రమిస్తున్నాను. ఈఆలోచనల మధ్య ఎపుడు నిద్దర పట్టిందో చెప్పలేను.

నిద్రపట్టినా, మేలుకొనే ఉన్నట్టుఉంది. నాకెలా అనిపించిందంటే, ఎవరో ఒకస్త్రీ, ఆకారంలో తూరయాలాగే ఉంది, కాని అంతకంటె భయంకరంగా ఉంది, గోడదాటి లోపలికి త్రోసుకువచ్చింది. చేతిలో వాడైన బాకు ఉంది, లాంతరు వెలుతుర్లో మెరుస్తూఉంది. జాగ్రత్తగా అడుగులువేస్తూ, రెప్పవాల్చకుండా పరికిస్తూ, మెల్లమెల్లగా నామీదికి వస్తూ ఉంది. ఆమెనుచూసి నేను లేవాలనుకుంటాను, కాని, కాళ్ళూ చేతులూ నాస్వాధీనంలోలేవు. ప్రాణంలేనట్టుగా అవికదలడమే లేదు. ఆమెనాదగ్గిరికి వచ్చేసింది. కొంచెంసేపు నన్ను చూసింది. బాకు పైకెత్తింది. నేను కేకలు వేద్దామనుకుంటాను, కాని గొంతుకపెగల్డంలేదు. మాటరావడంలేదు. నారెండుచేతులూ ఆమె ముడుకులతో దబాయించింది. నాఛాతీమీద సవారీ అయి కూచుంది. నేను గింజుకున్నాను. — నాకళ్ళువిడ్డాయి. నిజంగా ఒక కాబూలీ ఆడది నాగుండెలమీద సవారీఅయి ఉంది. చేతిలో బాకు ఉంది, పొడవడానికి సిద్ధంగా ఉంది.

నేనుఅన్నాను— 'ఎవరు తూరయా?

నిజంగా ఆమె తూరయావే. బలంగా నన్ను తొక్కిపెట్టి అంది — 'అవును, తూరయానే. ఇవాళ నువ్వు నాతండ్రిని చంపావు. దానికి బదులీగా నీప్రాణం పోతుంది.

అంటూనే బాకు మీదికి ఎత్తింది. నాకు జీవన మరణ

సమస్యగా ఉంది. మరణభయం నాలో సాహసాన్ని పురి కొల్పింది. నేను చావడానికి సిద్ధంగా లేను. నాలో కోర్కెలూ ఉల్లాసాలూ మిగిలే ఉన్నాయి. బలవంతంగా కుడి చేతిని విడి పించుకోవడం కోసం ప్రయత్నించాను. రెప్పపాటులో చెయ్యి విడిపోయింది. బలమంతా ఉపయోగించి తూరయా బాకు చేతిని పట్టుకున్నాను. ఎంచేతనో చెప్పలేను, తూరయా పెనుగులాడలేదు. నాచేతిని చూస్తూనే ఛాతీమీదినుండి దిగి పోయింది. ఆమె కళ్ళు రెప్పలు వాలడం లేదు. అదే ధ్యాసంగా నాచేతిని చూస్తూ ఉంది.

నవ్వుతూ అన్నాను – 'తూరయా, కథ అడ్డం తిరిగింది. ఇవుడు చావడం నీవంతు. నీతండ్రిని చంపను, ఇపుడు నిన్నూ చంపుతాను.'

తూరయా ఇప్పుడుకూడా రెప్పవాల్చకుండా నాచేతిని చూస్తూ ఉంది. మాటాడడం లేదు.

ఒకఊపు ఊపుతూ అన్నాను – 'మాటాడవేం? నీ ప్రాణం నాపిడికిలిలో ఉంది.

తూరయా తెలివితెచ్చుకుంది. గంభీరంగా, దృఢమైన కంఠంతో అంది – 'నువ్వనా అన్నవి. ఇవాళ నీతండ్రినే నువ్వు చంపావు.'

అలాంటి స్థితిలో కూడ తూరయామాటలు విని నవ్వు ఆగ లేదు నాకు. నవ్వుతూ అన్నాను – 'అస్త్రీదీలు మోసం కూడా చేస్తారన్న సంగతి వాళ్ళే నాకు బోధపడింది.'

తూరయూ శాంతంగా అంది – 'తప్పిపోయిన నాఅన్నవి, నాజరువి నువ్వు. ఇదిగో నీచేతిమీద గుర్తు. అదే చెపుతూ ఉంది నువ్వు తప్పిపోయిన నాఅన్నవని.

బాల్యం నుండీ నాచేతి మీద ఒక పచ్చబొట్టు ఉంది, ఒక పాము. పటాలం పోలికల రిజిష్టరులో కూడా అదే రాసి ఉంది.

నవ్వుతూ అన్నాను – 'తూరయూ, నన్ను మోసంచేయ లేవు. ఏవిధంగానూ నిన్ను విడిచిపెట్టను.'

తూరయూ తన చేతిలోని బాకు పారేసి అంది. 'నిజంగా నువ్వు నా అన్నవే. నీకు నమ్మకం లేకపోతే, అదిగో చూడు, నాకుడిచేతి మీదకూడా అలాంటి పామే ఉంది.'

తూరయూ చేతి మీదచూశాను. సరిగా నాలాంటి పచ్చ బొట్టే ఉంది ; పాము.

ఆలోచిస్తూ అన్నాను – 'తూరయూ. నమ్మకం కలగడం లేదు. ఇది కాకతాళీయన్యాయంకావచ్చు.'

తూరయూ అంది – 'చెయ్యి వదిలేయ్, తిరగబడను అఫ్రీదీలు అబద్ధమాడరు.'

చెయ్యి వదిలేశాను. ఆమె క్రింద చతికిల బడిపోయింది. నన్ను అదే చూడడం మొదలెట్టింది. కొంతసేపయాక అడిగింది – 'అచ్ఛా, నీతల్లిదండ్రుల సంగతేమైనా నీకు తెలుసా?'

తల వూపుతూ అన్నాను– 'ఉహూం, సర్కారు అనాథాలయంలో పెరిగాను.'

నామాట విని తూరయూ లేచి నిలబడింది — 'తప్పకుండా నువ్వు తప్పిపోయిన నాఅన్నవి నాజరువే. నేను పుట్టడానికి సంవత్సరం ముందు నువ్వు తప్పిపోయావు. అమ్మా, నాయనా, అందరూ సర్కారు ఫౌజు మీదికి పోట్లాడడానికి వచ్చారు. నువ్వుకూడా వాళ్ళతో ఉన్నావు. అమ్మ పోట్లాటలో మంచి చురుకుగా ఉండేది. నిన్ను వీపుమీద కట్టుకొని పోరాడుతూ ఉంది. ఒక గుండువచ్చి ఆమెకాలికి తగిలింది. తెలివి తప్పి పడి పోయింది. అంతలో ఎవరో వచ్చి నిన్ను విప్పుకుపోయారు. అమ్మని భుజంమీద వేసుకు నాన్న తీసుకువచ్చేశాడు. నిన్ను వెదక లేకపోయాడు. ఎంతో ప్రయత్నం చేశాడు. నీపత్తా తెలీడం లేదు. అమ్మ ఎల్లప్పుడూ నీమాటే చెప్పేది. ఆమె చేతిమీదా ఇలాంటి పామే ఉండేది.

ఇలా చెపుతూ మళ్ళీ ఆమె చెయ్యి చూపించింది. నా పాముతో ఆమెది సరిపెట్టి చూశాను. నిజానికి తూచ తప్ప కుండా రెండూ ఒకలాగే ఉన్నాయి. తల వెంట్రుక వాసి వారాలేదు. నేను హతాశుడిలా ఐపోయి కుర్చీమీద కూల బడ్డాను.

తూరయూ నాదగ్గిర కూచొని స్నేహంగా నా తలమీద చెమట తుడవడం మొదలు పెట్టింది. ఇలా అంది — 'నాజర్, అమ్మ చెప్పేది, నువ్వు చచ్చిపోలేదనీ, బ్రతికే ఉన్నావనీ, ఒకనాడు తప్పకుండా మాతో కలుస్తావనీను.

తూరయూ మాటమీద నాకు నమ్మకం కుదురుతూ

వచ్చింది. చెప్పలేను, ఎవరో నాహృదయంలో కూచొని చెపుతూ ఉన్నారు. ‘తూరయా చెప్పిందంతా నిజం’ అని. పెద్దనిట్టూర్పు విడిచి అన్నాను — ‘ఐతే, తూరయా, ఇవాళ నేను చంపిన ఆయన మన తండ్రే అన్నమాట.’

తూరయా మొగమ్మీద దుఃఖం ఒక మేఘంలాకప్పింది. దుఃఖంతో కూడిన గొంతుకతో అంది — ‘అవును, నాజర్, ఆ దురదృష్టవంతుడే మన తండ్రి. ఎవరికి తెలుసు, కన్నకొడుకు చేతిలోనే హలాకై పోతాడని?’

మనస్సు సరిపుచ్చుకుంటూ మళ్ళీఅంది — ‘కాని, నాజర్ నువ్వు ఈపని తెలిసి చెయ్యడంలేదు కదా! నాన్న చచ్చిపోయాక మరీ ఒంటరిదాన్నై పోయాను నేను. కాని నిన్ను సంపాదించాను. ఇపుడు నాన్న దుఃఖం మరిచిపోతాను. నాజర్, విచారించకు, నీకేం తెలుసు తండ్రెవరో తల్లెవరోను? చూడూ, నేనే నిన్ను చంపడానికి వచ్చాను. చంపేసేఉండును. కానీ, (ఖుదాకి మెహర్బానీ) మనవంశచిహ్నం పచ్చబొట్టు చూశాను. భగవదేచ్ఛ ఈవిధంగా ఉంది!’

తూరయా వల్ల తెలిసింది, నాతండ్రిపేరు హైదర్ ఖాఁ అనీ ఆయన ఒక అఫ్రీదీ సంఘసర్దార్ అనీ. సర్దార్ హిమ్మత్ సింగ్ విషయం మాటాడినపుడు ఆమె చెప్పింది. తూరయా అతణ్ణి ప్రేమించింది, మానాన్నతో దెబ్బలాడి వచ్చేసింది. హిమ్మత్ సింగును వివాహం చేసుకొందికి. కాని ఆయనభార్యను చూసి ఈర్ష్యవల్ల పిచ్చెత్తినట్లైపోయింది, ఆమెను పొడిచేసింది.

కాబూలీ యువతి వేషంలో వెళ్ళి తమాషా చెయ్యాలనుకుంది. కాని కథ మరోలా అడ్డం తిరిగింది.

సర్దార్ సాహెబ్ స్థితి ఆమెతో చెప్పాను. విని కొంచెపు ఆలోచించింది. తరవాత అంది — 'ఉఁ హూఁ, ఆ మనిషి అబద్ధాలకోరు. దగాబాజి. నేను అతణ్ణి పెళ్ళాడను. ఐనా, నీకోసం అంతా మరిచిపోతాను. రేపు అతని పిల్లల్ని తీసుకురా, ప్రేమిస్తాను.'

ఉపయాన్ని తూరయాను చూసి నా నౌకరు ఆశ్చర్య పోయాడు. నేను చెప్పాను — 'ఈమె నాస్వంత చెల్లెలు.' నౌకరు నమ్మలేదు. విస్తరించి సంగతంతా చెప్పాను. నాతండ్రి శవం గురించి కనుక్కోమని వాణ్ణి పంపించాను. వాడు వచ్చి చెప్పాడు — 'శవం పోలీసు స్టేషన్‌లో ఉంది.'

పెద్దదొర దగ్గరికి ఉత్తరం రాసి విషయమంతా వివరించాను. శవం ఇప్పించవలసిందని దరఖాస్తు చేశాను. వెంటనే దొర దగ్గరినుంచి అనుమతి వచ్చింది.

ఒక ఉత్తరం రాసి సర్దార్ సాహెబ్‌ను పిలిపించాను.

సర్దారు వచ్చి అడిగాడు — 'ఏమిటి సంగతి అసద్! ఇంత తొందరగా రమ్మని ఎందుకు రాశావు?'

నవ్వుతూ అన్నాను — 'మేజర్ సాహెబ్, నాపేరు అసద్ కాదు, నాజర్.

మేజర్ తెల్లబోతూ అన్నాడు — 'రాతిరి-గోపుగా నువ్వు పిచ్చెత్తిపోలేదుకదా!

నవ్వుతూ మళ్ళీ చెప్పాను — 'లేదు, సర్దార్‌జీ, ఇంకా వినండి, తూరయా నాస్వంత చెల్లెలు. నిన్న నేను చంపే శానే, ఆయన మాతండ్రి.

సర్దార్ సాహెబ్‌కు నామాటలు విని కాళ్ళూ చేతులూ అందడం లేదు. నిచ్ఛేరపోతూ అన్నాడు — 'అసద్, నువ్వు నన్ను కూడా పిచ్చెత్తించేస్తున్నావా ఏమిటి?

ఆయన చేతులు పట్టుకొని అన్నాను — 'దయ చేయండి, తూరయా నోటినుండే సంగతంతా వినదురుగాని, తూరయా నాదగ్గిర మీకోసం ఎదురుచూస్తూ ఉంది.'

సర్దార్ నావెంట లోపలికి వచ్చాడు. ఆయన రావడం చూసి తూరయా లేచి నిలబడింది. నవ్వుతూ అంది —'కైదీ, ఏదీ ఆపాట పాడూ!'

సర్దారూ, నేనూ నవ్వాపుకో లేకపోయాం.

సర్దారును కూచోబెట్టి సవిస్తరంగా అంతా వినిపించాను. అంతా విని సర్దార్ అన్నాడు — 'నాజర్, ఇక ముందు నిన్ను నాజర్ అనే పిలుస్తాను, తూరయా కోసం నిన్ను అర్థిస్తున్నాను. ఈమెను వివాహం చేసుకుంటాను.'

నవ్వుతూ అన్నాను నేను — 'కాని మీరు హిందువులు, మేం మహామ్మదీయులం మరి.'

సర్దార్ నవ్వుతూ అన్నాడు — 'పటాలం వాళ్ళకు జాతీ, పంక్తీ లేదోయ్.'

ఇంతలో తూరయా అంది – 'సర్దార్‌జీ, నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోను. కాని, పిల్లన్ని నాదగ్గరికి పంపించేస్తే మాత్రం వాళ్ళ అమ్మనౌతాను.'

సర్దార్ నవ్వుతూ వెళ్ళాడు.

అవాళ సాయంకాలం సర్దార్‌సాహెబూ, తూరయా, పటాలం వాళ్ళూ అందరం కలిసి మాతంగ్రడి శవాన్ని సమాధి చేశాం.

సూర్యుడు అస్తమిస్తూ ఉన్నాడు. మెల్లమెల్లగా చీకటి ముంచుకొస్తూఉంది. మేము ఇద్దరమూ – తూరయా, నేనూ మాతంగ్రడి సమాధి దగ్గిర ఫాతిహా చదువుతూ ఉన్నాం.



# మరో కుమారుడు

'సిన్ ఫారోసా ఇంట్లో ఉందా ?'

'ఆఁ, తలుపు తట్టు.'

తలుపుతట్టి ముసిల్ది మరాగ్రాట్సియా ద్వారంముందు చిన్న మెట్లమీద కూచుంది మాట్లాడకుండా.

ఆమెట్లమీదే ఆమెకూచుంటుంది. గుమ్మాల ముందు ఇలాంటి మెట్లమీదే ఆమె నివాసం. ఫార్నియా గ్రామంలో ఒకచోట అనికాదు, ఈ ఇంటిముందు కాకపోతే, మరోఇంటి ముందు, అదికాకపోతే ఇంకోఇంటిముందు ఇలాగే ముడుచుకు కూచుంటుంది. ఒకప్పుడు కునుకుతూ మరో అప్పుడు మౌనంగా కన్నీళ్ళుకారుస్తూ కాలం గడిపేస్తుంది. దారి పోయేవాళ్ళు ఎవరైనా ఒళ్ళో ఓ రొట్టెముక్కో, ఓరాగిడబ్బో పడేసినా లేవదు. కన్నీళ్ళయినా తుడవదు. వాటినితీసి ముద్దు పెట్టుకుంటుంది, శిలువగుర్తుచేసి ఏమస్తుంది. లేదా కునకడం ఆరంభిస్తుంది. ఆమెను చూస్తే నూనె జిడ్డుతో ఒకబస్తామచింకి పీలికలమూట అనిపిస్తుంది చలికాలం అనికాదు, ఎండా కాలం అనికాదు, మున్నూటఅరవై రోజులూ ఇదేరకం — వెయ్యి చిరుగులూ, చెమటా, దుమ్మూ, దుర్గంధమూను. పసుపుముద్దలాంటి ముఖంమీద ముడతలు, వలలాంటిగీతలు. ఎల్లప్పుడూ కన్నీళ్ళు కారడంవల్ల ఉబ్బి, విప్పారిన కంటిరెప్పలు ఎర్రగా అసహ్యంగా ఉన్నాయి. ఆముడతలలోంచి, కన్నీళ్ళ

ఎరుపులోంచి ఉజ్జ్వలమైన రెండునేత్రాలు తళతళ మెరుస్తూ ఉంటాయి. ఆకళ్ళచూపుల్లో చిరకాలంనాటి మరచిపోయిన శైశవచ్ఛాయలు తొంగిచూస్తాయి. ఆకళ్ళమీద ఈగలు ఆకలితో వాల్తాయి. ముసిల్దివాటిని తోలదు. తనదుఃఖమూ, తానూ, అంతే. ఈగల గుర్తే ఆమెకు ఉండదు. నూనెఅంటే ఏమిటో తెలీని పిడికెడుజుత్తూ అట్టగట్టిచెవులదాకా వ్రేలాడుతూ ఉంటుంది. యవ్వనంలో ధరించిన బరువైన ఆభరణాలవల్ల రెండుచెవులూ తెగిపోయాయి.

గుమ్మాల మీద కూచునిఉన్న స్త్రీలు ఎవ్వరూ ఈమె దిక్కు తిరిగి చూడలేదు. పాకల ముందు కబుర్లు చెప్పుకుంటూ ఉన్నవాళ్లు ఇంచుమించు దినమంతా అలాగే గడిపేస్తారు. కాని ప్రతివాళ్లూ ఏదో ఒకపని చేస్తూనేఉన్నారు. గుడ్డలు అతుకులు వేయడం, వంటచేయడం, వడకడం—ఇలాగ. ఇళ్ళన్నీ ఒకక్కదగ్గిరే పశువులకూ, మనుష్యులకూ నివేశాలుగా ఉన్నాయి. వీధిలో ఏరాళ్లైతే ఉన్నాయో, ఇళ్ళ మధ్యకూడా అవేరాళ్ళున్నాయి. కిటికీలనుండి మాత్రం లోపలికి తొంగి చూస్తుంది వెల్తురు. ఒకప్రక్క పశువులసాల, అందులో గాడిదలో కంచరగాడిదలో, ఎల్లప్పుడూ ఈగలకోసం తోకలు విసురుతూ ఉంటాయి. ఇంకోప్రక్క ఎత్తయిన అరుగు, నిద్రపోయే స్థలం. ప్రతీయింటా 'కాఫిన్' (శవపేటిక) లాంటి పొడవాటి పేకేజీపెట్టె, చొప్పదిండ్లతో రెండోమూడో కుర్చీలూ, ఒక కర్రపీటా, మరికొన్ని వ్యవసాయపు పనిముట్లూను. ఆప్రాం

తంలో జనసామాన్యం ప్రేమించే మహాపురుషుల పటాలు చవకబారువి ఒకటో రెండో, గోడల వేలాడు తున్నాయి. పొగా, చెత్తా చెదారంతో ఉన్న వీథిలో రాగిలా ఎర్రగా వున్న పిల్లలు ఆడుకుంటూ ఉన్నారు. కొందరు సంపూర్ణంగా నగ్నం, కొందరి ఒంటిమీద ఏదో ఒక మురికిలాల్చీ చింకిది. కోడిపిల్లలు ఆమధ్యనుండి ఇటూఅటూ తిరుగుతున్నాయి అరుస్తూ. బురదపులుముకొని పందికూనలు చెత్తకుప్పలు తవ్వేస్తూ ఉన్నాయి. మర్నాడు ఉదయం దక్షిణఅమెరికా వెళ్ళిపోతూ ఉన్నవాళ్ళ విషయం మాట్లాడుకుంటూ ఉన్నారు ఆడ వాళ్ళంతా.

ఒకామె అంటున్నది, 'భార్యనీ, ముగ్గురుపిల్లల్నీ వదిలేసి వెళ్ళిపోతున్నాడు సారోస్కామా'

మరోఆమె అంది, 'ఐదుగురు పిల్లల్ని, పెళ్ళాన్ని వదిలేసి వెళుతున్నాడు ఎడోస్వర్డియూ. పెళ్ళాం నీళ్ళోసు కుంది కూడాను.'

మూడో ఆమె అడిగింది, 'కార్మయిూన్ రంజా నిజంగా పన్నెండేళ్ళ కొడుకుని గంధకం గనిలోకి తీసికెళుతున్నాడా? పాపం భార్యదగ్గిర ఆకుర్రాణ్ణయినా ఉంచి వెళ్ళవలిసింది. ఇక ఆవిడకి దిక్కే లేదన్నమాట!'

కొంచెం దూరంలో కూచున్న నాలుగోఆవిడ జాలిగా అంది. 'నానట్సియోలిగ్రోచీ ఇంట్లో రాత్రంతా ఇంటిల్లిపాదీ అదే ఏడవడం. నానట్సియోకొడుకు నిచో, యుద్ధంనుండి

మొన్న మొన్నే వచ్చాడు, వాడూ బయల్దేరుతున్నాడు రేపు. పాపం, ఇంటంతా అదే మొత్తుకోవడం!'

ఈ మాటలు విని ఉబుకుతూ ఉన్న దుఃఖం ఆపుకోవడం కోసం ముసిల్ది మరాట్రియూ నోటిదగ్గర గుడ్డ అడ్డుపెట్టుకుంది. కాని లాభం లేకపోయింది. రెండు కళ్ళనుండి కన్నీళ్ళు ప్రవాహంలా ఉప్పొంగాయి.

పద్నాలుగేళ్ళ క్రిందట ఆమె ఇద్దరు కొడుకులూ అమెరికా వెళిపోయారు. ఐదేళ్ళలో తిరిగి వచ్చేస్తామని చెప్పారు. అక్కడ ఆస్తిపాస్తులు సంపాదించుకున్నారు, ముఖ్యంగా పెద్ద వాడు మంచిస్థితిలోకి వచ్చాడు. పర్యవసానం ఏమయిందంటే, ముసిలితల్లిని మరచిపోయారు. నిన్ ఫరోసాచేత ఉత్తరం రాయించి ఫార్నియానుండి వెళ్ళే వాళ్ళచేత ప్రతీసారీ పంపించేది ముసిల్ది. స్వయంగా కొడుకులచేతిలో ఇమ్మని కాళ్ళావేళ్ళా పడేది. పెద్దపెద్ద మూటలతో దగ్గరనున్న రైలుస్టేషనుకు వాళ్ళుబయల్దేరే వాళ్ళు. తల్లులూ, భార్యలూ ఏడుస్తూ, మొత్తుకుంటూ కొంతదూరం వెంటపడేవాళ్ళు. వాళ్ళతోకలిసి ముసిల్దికూడా, ఆధూళి రేగుతూ ఉన్న దారిలో చాలాదూరం వెంబడించేది. ఇలా ఓసారి వెళుతూఉండగా, ఒక కుర్రాడు తనవాళ్ళను ఏడవవద్దని అడావుడిచేసి ఉత్సాహం చూపడం ముసిల్ది రెప్పవాలకండా చూస్తూఉంది. అదిచూసి యువకుడు అన్నాడు గట్టిగా:

'ఏమేవ్, మునలమ్మా, అలాచూస్తావేం? నాకళ్ళు గాని పొడిచేస్తావా ఏఁవిటి?

'లేదు బాబూ, లేదు. నీకళ్ళనుచూస్తే నాకదోలా ఉంది. ఏమంటావా? ఆకళ్ళతో నువ్వునాకొడుకుల్ని చూస్తావు. నా అవస్థంతా చూశావుకదా నాయనా, నాకొడుకులతో చెప్పు, 'ఇంకా ఆలస్యం చేశారా అంటే ముసిల్దాన్ని మరి చూడ లేరు' అనిచెప్పు.'

మర్నాడు బయల్దేరుతూ ఉన్నవాళ్ళ విషయమే ఊళ్లో అందరూ చెప్పుకుంటూ ఉన్నారు. పక్కనందులో గాడిద జీను మీద తలపెట్టుకొని వెల్లకిలా చేరబడి ఒక ముసలాడు పొగపీలుస్తూ, ఈసంభాషణ అంతా వింటున్నాడు. అంతలో తన, మురికిచేతులు రెండూ గుండెమీద ఆనుకొని, ఉమ్మేసి అన్నాడు: 'నేనే రాజునైతే అక్కడినుండి ఫార్నియాకుఒక్క ఉత్తరమన్నా రానీను.'

ఒక యువతి గట్టిగా అంది: 'నీతల్లికడుపు చల్లగాఉండాలి జాకోస్పినా, కాని, ఈపాపిష్టి తల్లులూ, పెళ్ళాలూ బ్రతకడం ఎలాగ?'

'వాళ్లు ఉత్తరాల మీద ఉత్తరాలు రాస్తారు. అదే వచ్చిందిచిక్కు.' దగ్గుతూ ముసలాడు మళ్ళీ ఉమ్మేశాడు. 'తల్లులు కూలీనాలీ చేసుకు బ్రతుకుతారు. భార్యలు కొంచెం నడిలిస్తేసరి... ఈకుర్రాళ్ళు అక్కడి కష్టాలు ఎందుకురాయరో నాకు అర్థంకాదు. వాళ్ల మంచిసంగతులు మాత్రంరాస్తారు.

అవి చూచి ఇక్కడి వెర్రివెంగళాయలు చిందులు తొక్కు తారు. మనపొలాల్లో ఎవరు పనిచేస్తారో నాకు తెలీడం లేదు. కాలిఫోర్నియాలో మనుష్యులు ఉన్నారంటే, కేవలం ముసలాళ్లూ, ఆడాళ్ళూ, పసిపాపలూను. కళ్లారా చూస్తు న్నాను. పంటపొలాలు పాడైపోతూనే ఉన్నాయి. కేవలం రెండుచేతులుపట్టుకొని ఏంచెయ్యగలం? ఐనా, వాళ్ళు వెళు తూనేఉన్నారు. ఇంకావెళతారు. పోనీ, తగలబడిపోనీ. చవ టవెధవలనెత్తిని పిడుగు పడితే బావుండేది.'

సరిగ్గా అదేసమయానికి తలుపు తీసింది నిన్‌ఫరోసా. ఆ ఇరుకు సందులో హటాత్తుగా సూర్యోదయ మైనట్టయింది. మెరిసిపోతూ ఉన్న నల్లటికళ్ళూ, విరిసి పోతూఉన్న ఎర్రటి పెదవులూను. మలచినట్లు దృఢమైన శరీరం, నాటు వయ్యారం. పసుపూ, ఎరుపూ, చుక్కల రుమాలు ఎత్తయిన స్తనాలమీద బిగించి కట్టింది. చెవుల్లోపెద్దపెద్దజూకాలు. శిరోజాలు ఉంగరా లుగా తిరిగి ఉన్నాయి, పాపటలేదు. వెనక్కి బింకంగా దువ్వి మెడ దగ్గిర ముడివేసింది. ముడిలో ఒక వెండి చాకు దోపింది. నున్నని చిబుకంమీద అతిఅందమైన చిన్న పొట్ర. ఆమెను చూచినకొద్దీ చూడాలనిపిస్తుంది. ముఖంలో ఉత్సాహమూ, హాస్యమూ తొణుకుతూ ఉంటాయి.

పెళ్ళయి పూరా రెండేళ్ళు నిండాయో లేదో నిన్‌ఫ రోసా భర్త చచ్చిపోయాడు. ఐదేళ్ళక్రింద రెండో భర్త తనను విడిచిపెట్టి అమెరికా వెళ్ళిపోయాడు. విషయం ఎవ

రికీ చెప్పవలసింది కాదనుకోండి, కాని ఒకనాటిరాత్రి గ్రామం లోని ఒక ఘరానా వ్యక్తి తోటలోపడి, కిటికీగుండా ఆమె దగ్గిరికి వెళ్లాడు. దాంతో నీతిపరులూ, దైవభీతికల వాళ్లూ అయిన ఇరుగుపొరుగువాళ్లు ఆమెను ఓరచూపులు చూడడం మొదలుపెట్టారు. ఐతే, లోపల మాత్రం మచ్చరించుకునే వాళ్ళు; ఆమె అదృష్టంచూచి, సిన్‌ఘరోసామీద ఊళ్లోవాళ్ళ కోపానికి మరో కారణంకూడా ఉంది. ఆమె రెండోభర్త వెళ్లిపోయాక. ఊళ్లోవున్న వయసు పిల్లలమీద లేనిపోని నిందలుమోపి అమెరికా వాళ్ళభర్తల దగ్గిరికి ఆకాశ రామన్న ఉత్తరాలు అనేకంరాసిందని గుసగుసలుగా ఉండేది.

'ఎవ్వరుబాబూ, ఉపన్యాసం వెలిగిస్తున్నారు?' వీధిలో అడుగు పెడుతూ అంది సిన్‌ఘరోసా, 'ఓ, జాకోస్సినా? జాకో మామా, ఫార్నియాలో కేవలం మేం, ఆడవాళ్ళమే ఉంటే మరీబావుండేది. అపుడు మేమే పొలం దున్నేవాళ్ళం.'

బొంగురు గొంతుకతో ముసలాడన్నాడు: 'ఆడాళ్ళచేత కేవలం ఒక్కపని మాత్రం అవుతుంది.' అంటూ మళ్లీ ఉమ్మాడు.

'ఏం పని మామా, చెప్పూ, చెప్పాలిమరి.'

'ఏడవడం, — ఇంకా మరోపనికూడాను.'

'ఐతే, రెండుపనులన్నమాట. అదేదోకూడా చెప్పుమరి కాని, చూడూ, నేను ఏడవడం లేదే.'

'అవునౌను, ఆమాట నాకు తెలియంది కాదు. నీ మొదటిమొగుడు చచ్చిపోయినప్పుడూ నువ్వు ఏడవలేదు.'

వెంటనే మొహం మీదే జవాబు చెప్పింది నిన్‌ఫరోసా. 'ఐతే, మామా, నేను ముందు చచ్చిపోయిఉంటే, ఆయన మాత్రం మరోపెళ్ళి చేసుకోకపోయ్యేవాడా! తప్పకుండా చేసుకొనే వాడే. పోనీ, ఆమాటకేం గాని, మా అందరిలోకీ అధికంగా ఎవళ్ళేడుస్తారో, చూడూ – మరాగ్రాట్సియా!

మళ్ళీ వెల్లకిలా పడుకుంటూ జాకోప్పినో బొంగురుగా అన్నాడు, 'ముసల్దానికి నీళ్ళుకార్చడం కావాలి. అంచేత కళ్ళుండెడి నీళ్ళు కారుస్తూ ఉంటుంది.'

స్త్రీలందరూ గొల్లున నవ్వారు. సమాధినుండి మేలుకొని మరాగాట్సియా గట్టిగా అంది.

'సూర్యులలాంటి అందమైన కొడుకుల్ని పోగొట్టుకున్నాను. నన్ను ఏడవన్నా ఏడవనివ్వరా మీరు!'

'అందమైనవాళ్ళు, నిజంగా అందాల రాజులు. వాళ్ళకోసం ఏడవకపోతే ఎలా?' నిన్‌ఫరోసా అంది, 'వాళ్లు అక్కడ సౌఖ్యాల్లో తేలుతున్నారు. ఇక్కడ నిన్ను బికారిలా చావమని వదిలేశారు.'

'వాళ్ళు నాకొడుకులు, నేను వాళ్ళ అమ్మని, నాదుఃఖం వాళ్ళకెలా తెలుస్తుంది?' అంది ముసిల్ది.

నిన్‌ఫరోసా అంది, 'ఇంతదుఃఖం, ఇంత కన్నీరూ ఎందుకో

నాకు బోధ పడదు తల్లీ, నువ్వే వాళ్ళని బాధపెట్టి తగిలేశా వని లోకం కోడై కూస్తోంది మరి.'

'నేనా?' రెండుచేతులా గుండెలు బాదుకొంటూ మరా గ్రాట్సియా అరిచింది, 'నేనా? ఎవరంటున్నారు ఈమాట?'

'ఎవరో ఒకరంటున్నారు.'

'వాళ్ళ ముఖాన్ని అగ్గిపొయ్యా, వాళ్ళనెత్తిని పిడుగుపడా, నేనా? నాకొడుకుల్ని నేను...

మాటకి అడ్డం వచ్చి ఒకామె అంది, 'ఎందుకా మాటలు వింటావ్, తెలీడం లేదూ, హాస్యాని కలా అంటూఉంది.'

కటిస్థలం దాకా శరీరం కదిలిస్తూ నిన్‌ఫరోసా చాలాసేపు నవ్వింది. నిష్ఠురంగా చేసిన పరిహాసానికి ఓదార్పుగా, తీపి మాటలతో అడిగింది. 'బాగానే ఉందిగాని, అవ్వా, నువ్వు వచ్చిన పనేదో చెప్పావు కావు'

వణుకుతూ ఉన్న చేత్తో, ముడతముడతలుగా నలిగిపోయిన ఓ కాగితం, ఓకవరూ గుండెల్లోంచి పైకితీసింది మరాగ్రాట్సియా. నిన్‌ఫరోసాకి అది చూపించి జాలిగా నిలబడి చూస్తూ అంది, 'ఎప్పటిలాగే ఈసారికూడా దయచేసి........

'ఏమిటీ, మళ్ళీ ఉత్తరమే?'

'నువ్వు కనికరిస్తే —'

కొంచెం చికాకుగా చూసింది నిన్‌ఫరోసా. కాని ఎలాగూ ముసలమ్మను తప్పించుకోవడం సాధ్యం కాదని తెలిసి, ఇంట్లోకి తీసుకువెళ్ళింది. ఈ ఇంటికీ, అక్కడ ఇతరకొంపలకూ పోలికే

లేదు. ద్వారం మూసేస్తే చాలు, పెద్దగది చీకటైపోతుంది. వెల్తురుకోసం వేరే కిటికీ ఉంది, కాని దాని తలుపులుఎప్పుడూ మూసేసే ఉంటాయి. గదిలో ఇనపమంచం, బట్టలు ఉంచే బీరువా, డ్రాయర్లతోనూ, మీద మార్బిలుపలకలతోనూ ఒక రోజువుడ్ టేబిలూ, అందంగా ఉన్నాయి. నిజానికి ఈ సామగ్రి సాధారణ రకానిదే, ఐనా కేవలం కట్టుపని చేసుకుంటూ ఇవన్నీ ఆమె సంపాదించిదంటేమాత్రం నమ్మడానికి వీలేదు.

మురికి కాగితం టేబిలుమీద పెట్టి, కలం సిరాబుడ్డి తెచ్చి రాతకు సిద్ధపడింది నిన్ ఫరోసా.

'చెప్పు వేగం'

'నాకుమారులారా,' ముసిల్ది చెప్పడం ఆరంభించింది, 'ఏడ్చి ఏడ్చి నాకళ్ళు గుడ్డివై పోవచ్చాయి...'

అలిసి బేజారైనట్టు నిట్టూర్పు విడిచింది నిన్ ఫరోసా. తరవాత రాసుకుంటూ పోతున్నది. ఈఉత్తరాల్లో ఏమిటి రాయాలో అదంతా ఆమెకు కొట్టినపిండి.

ముసిల్ది చెపుతూవుంది, 'మిమ్మల్ని ఆఖరుసారి చూడడం కోసం నాకళ్ళు కాయలు కాసి ఉన్నాయి...' 'ఆగు, ఆగు' నిన్ ఫరోసా అడ్డువచ్చింది, ఈమాటలన్నీ కనీసం ముప్ఫయి సార్లయినా రాయించి ఉంటావు.'

'ఐనా, రాయి. నీకుమాత్రం తెలీదా ఈమాటలు అక్షరాలా నిజమని! పోనీరాయి, — నాకుమారులారా,......'

'మళ్ళీ మొదటినుండీ ఆరంభించావ్రూ!'

'ఉఁహూఁ, ఈమారు ఇంకోటి రాయాలి. నిన్న రాత్రంతా ఆలోచించి నిశ్చయించాను. రాయి, చెపుతాను; నాకుమారులారా, నేను మీ ముసలితల్లిని, ప్రమాణం చేసి చెపుతున్నాను, అవును. ఇక రాయి, దేవుడిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. మీరు ఫార్నియా తిరిగి వచ్చేస్తే, నేను బ్రతికి ఉంటూఉండగా నాఇల్లు మీకు ఇచ్చేస్తాను.'

నిన్ఫరోసా విరగబడి నవ్వింది. 'ఇల్లంటే ఆపాత తడిక లేనా? నీకొడుకులు నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉన్నారని వింటున్నాం, బురదా, బూడిదతో ఈనాలుగు తడికెగోడలు వాళ్ళకెందుకూ? ఏంచేసుకుంటారని? ఉఫ్ అంటే ఎగిరి పోతాయికదా!'

'నువ్వూరాద్దూ, స్వంతఊళ్ళో నాలుగు రాతిముక్కలతో పొరుగూరి సామ్రాజ్యం సాటిరాదు. రాయి, రాయి.'

'రాసేశాను. ఇంకా ఏం రాయాలో చెప్పు.'

'చెపుతున్నాను—దురదృష్టవంతురాలైన మీ అమ్మ చలికి చచ్చిపోతూఉంది. రెండు గుడ్డముక్కలు కావాలి. చిల్లిగవ్వయినా లేక బాధపడి పోతూఉంది. మీరు కనికరించి ఒక అయిదు లిరాల* నోటు పంపించారంటే......'

'ఆఁ, ఆఁ, ఐంది. రాశాను. ఐపోయింది, కాయితం మడిచేసి, కవర్లోపెడుతూ నిన్ఫరోసాఅంది 'అంతా పూర్తిగా రాసేశాను. ఓ, చాలు.'

---

* lira ఇటలీనాణెం

' ఈ ఐదులిరాల కాయితం మాటూరాశావా ?' ఇంతతొందరగా రాతపూర్తి కావడం చూసి ముసిల్ది ఆశ్చర్యపోయింది.

' ఆఁ, ఐదులిరాలనోటు మాటూ రాశాను.'

' అన్నిమాటలూ సరిగ్గా రాశావా ?'

' అబ్బా ప్రాణం తీసేస్తావుకదా, అన్నీ సరిగ్గా రాశాను, రాశాను, రాశాను '

' ముసిల్దాని మీాద చిరాకుపడకు తల్లీ, నాబుర్రసరిగ్గా ఉందా ఏమన్నానా ! పిచ్చిది నాకంటె నయం. దేవుడు నీకు మేలుచేస్తాడు.'

కవరు పుచ్చుకొని గుండెల్లో దాచింది. నాఁటిస్రియోలిగ్రోచీ కొడుకు చేత ఉత్తరంపంపాలని ఆమెనిశ్చయం. సాంటూపే రోసారియొ నగరానికి వెళుతున్నాడతడు. అక్కడే ఆమె కొడుకులిద్దరూ ఉన్నారు. ఉత్తరం ఇవ్వడంకోసం బయల్దేరింది ముసిల్ది.

సాయంకాలమైంది. స్త్రీలు ఎవళ్ళఇళ్ళల్లోకి వాళ్లు వెళ్ళిపోయారు. ప్రతిగుమ్మంతలుపూ మూతపడింది. అక్కడక్కడ ఉన్న కిరసనాయిలు దీపాలు ముట్టించడం కోసం బుజం మీాద నిచ్చెన వేసుకొని వెళుతున్న మనిషి తప్ప వీధిలో ఎవ్వరి అలికిడీ లేదు. పిట్టమనిషన్నా లేకండా నిశ్శబ్దంగా చెత్తా చెదారంతో ఉన్నవీధిలో, మసకమసక కిరసనాయిలు దీపాలతో మరింత దిగాలుగా ఉంది.

ముందుకి వంగి ముసిల్ది మర్గారెట్స్రియా నడుస్తూఉంది.

మాతృవాత్సల్యంతో వెచ్చదనం కలిగిస్తూ ఉందా అన్నట్టు ఉత్తరం గుండెల్లో చేత్తో అదుముకుని పట్టుకుంది. రెండో చేత్తో తలా, వీపూ నొక్కుకుంటూ ఉంది. ప్రతీసారి ఓ క్రొత్త ఉత్తరం పంపడంతో, ఆమెకో క్రొత్త ఆశ పుట్టుకు వచ్చేది. ఈ సారి కొడుకుల గుండె కరుగుతుంది, తిరిగివచ్చేస్తారు అని ఆశ కలిగేది. ఉత్తరం చదవగానే, పద్నాలుగేళ్ళనుండి ఆమె ఎలా దుఃఖంతో ఏడుస్తూ ఉన్నదీ తెలియగానే, తప్పకండా వాళ్ళు, తన బంగారం తండ్రులు తనని కాదనలేరు......'

కాని ఇవాళ తన గుండెల్లో అదుముకు పట్టుకెళుతూ ఉన్న ఉత్తరం గురించి మాత్రం ఆమెకు సంపూర్ణంగా నమ్మకంలేదు. ఎంచేతనంటే, అంతతొందరతొందరగా ముగించింది నిన్‌ఫరోసా. విశేషించి చివరివిషయంలో, గుడ్డముక్కలకోసం ఐదులిరాల నోటుసంగతి రాయడంలో ఆమె సందేహం మరీ ఎక్కువగా ఉంది. 'ఐదులిరాలు చలిలో వాళ్ళ అమ్మ ఎంతబాధ పడుతూఉంది, గుడ్డముక్కల కోసం ఈమాత్రం పంపడమంటే, బంగారంలో తులతూగుతూ ఉన్న ఆమెకొడుకులకు ఓలెక్కలోదేకాదు......'

ఇంతలో తలుపులు మూతలుపడ్డ కొంపలలో ఏడుపులు ఆరంభమైనాయి — తల్లులు కొడుకులకోసం ఏడుస్తున్నారు — తెల్లవారితే వాళ్ళు వెళ్ళిపోతారు.

'అమ్మో, నాతండ్రులూ,' ఉత్తరం గుండెకు మరింత గట్టిగా అదుముకొని మరాగ్రాట్సియా తనలో తాను దుఃఖించింది.

ఎలా విడిచి వెళ్ళిపోగలిగార్రా మీరు, తిరిగి వెళ్ళిపో వస్తామని చెప్పారు, కాని వెళ్ళినదారి మరిచూశారు కారురా నాయనలూ. అమ్మో, పాపిష్టితల్లులారా! వాళ్ళమాటలు నమ్మకండమ్మా, — వాళ్ళు మరిరాగు, ఎంతమాత్రం రారు...'

సందు మధ్య జోళ్ళచప్పుడు విని ఒకదీపందగ్గిర ఆగింది ముసిల్ది. ఎవరా వచ్చేది?

అబ్బే, మరెవరూకాదు, ఊళ్ళోని డాక్టరు కుర్రాడు. మొన్న మొన్నే కొత్తగా వచ్చాడు. ఇక్కడి నుండి వేగంగా వెళిపోతాడని రూమరుగా ఉంది. అతడివల్ల ఇక్కడిపని జరగదని కాదు, ఊళ్ళో పెద్దల శుభదృష్టిలో ఈనలేదు. బీదవాళ్ళకి మాత్రం ఇతడంటే దేవుడు. చూడ్డానికి కుర్రాడులా ఉంటాడు. ఐనా జ్ఞానంలో మాత్రం అందెవేసిన చెయ్యి. అతడూ అమెరికా వెళిపోతాడని వదంతిగాఉంది. ఐతే, అతగాడికి తల్లిమాత్రం లేకపోవడం కొంతనయం. ఒంటరిగానే ఉంటున్నాడు.

మరాగ్రాట్సియా అడిగింది—'డాక్టరుబాబూ, దయచేసి చిన్న ఉపకారం చేసి పెడతారూ?' ఆశ్చర్యపడుతూ డాక్టరు దీపంక్రింద ఆగిపోయాడు. ఏదో ఆలోచనలో ఒంటరిగా వచ్చేస్తూ ముసిలిదాన్ని చూడనేలేదు.

'ఎవరు నువ్వు? ఓహో, నువ్వా, ముసలమ్మ.....'

జ్ఞాపకం వచ్చింది, ఈచింకి గుడ్డల బస్తాని అనేకసార్లు ఏదో ఒక గుమ్మం ముందు చూసే ఉన్నాడు.

'డాక్టరు బాబూ, దయచేసి ఈ ఉత్తరం ఓసారి చదివి

పెట్టరూ, ఇది నాకొడుకుల దగ్గిరికి పంపిస్తాను.

'ఏదీ చూడనీ,' అన్నాడు డాక్టరు. కళ్ళకి చత్వారం కళ్ళజోడు సర్దుకున్నాడు.

గుండెల్లోంచి ఉత్తరం తీసి ఇచ్చింది. నిన్ ఫరోసాతో చెప్పిన మాటలు వినడానికి ఆతురతగా ఎదురుచూస్తున్నది మరాగ్రాట్సియా.

'నా కుమారులారా'—ఉఁహూఁ, రాత డాక్టరుకి కనపడ్డం లేదా, లేకపోతే అక్షరాలు చదవలేక పోతున్నాడా?'

డాక్టరు కాయితం కళ్ళదగ్గిరపెట్టుకు చూశాడు, వెల్తుర్లో బాగా దూరంగా పట్టుకెళ్ళి చూశాడు. అటు తిప్పాడు. ఇటు తిప్పాడు. చివరికి అన్నాడు: 'ఏమిటిది?'

'చదవలేక పోతున్నారా?' భయపడుతూ అడిగింది మరాగ్రాట్సియా.

డాక్టరు నవ్వాడు, 'ఏమీలేదు దీనిలో. అసలు రాతే లేదు,' అన్నాడు, నాలుగు కొక్కిరిగీతలు మాత్రం కనపడు తున్నాయి. ఇదిగో, చూడు నువ్వే.'

'ఏమిటీ?' ఆశ్చర్యంతో అరిచింది ముసిల్ది.

'అవును, అంతే. నువ్వేచూడు మరి. ఏమీలేదు. అసలు రాతేలేదు.'

'నిజం?' ముసిల్ది బాదుకుంటూ అంది, 'అదేమన్న మాట! నిన్ ఫరోసాకి నేను స్వయంగా చెప్పాను, స్పష్టంగా చెప్పాను. అది రాయడం కళ్లారా చూశాను.'

'ఐతే, ఆమె రాసినట్టు నటించిందన్నమాట.' అన్నాడు డాక్టరు పెదవి విరుస్తూ.

కొంచేపుదాకా రాయిలా ఐపోయింది మర్గ్రాట్సియా. తరవాత గుండెలు బాదుకుంటూ, గద్గదికతతో అంది :

'అయ్యో, అయ్యో, దండుముండ, పిశాచి, ఎందుకింత దగా చేసిందీ! అంచేతనే మానాయనలు జవాబు రాయలేదు. ఉత్తరాల్లో ఒకమాటా వాళ్లకు అందలేదు మరి. నేను చెప్పింది ఏదీ, ఎప్పుడూ రాయలేదన్నమాట !......అసలు సంగతి ఇదీమరి. మానాయనలు నాసంగతే ఎరగరు. వాళ్ల కోసం బికారిదాన్నై ఉన్న నాఅవస్థ వాళ్ళకు తెలీదు. నేను వాళ్ళ నెలా నిందించేది? ఏమని నిందించేది? డాక్టరు బాబూ, ఈపాడుముండ నన్ను మాటిమాటికీ మోసం చేసింది. అయ్యో దేవుడా, అయ్యో భగవంతుడా, కొడుకులను పోగొట్టుకొన్న దిక్కులేని తల్లిని ఇలా ఎవరైనా దగా చేస్తారా? నావంటి బికారి ముసల్దానితో పరిహాసం చేస్తారా? అయ్యో, అయ్యో, పిశాచీ, రాక్షసీ...!

విని, డాక్టరు హృదయం కనికరంతో కరిగిపోయింది. ఓదార్చడానికి చాలా ప్రయత్నించాడు. నిన్ ఫరోసా ఎవరో, ఆమె ఇల్లెక్కడో, ఇవన్నీ ముసలమ్మ దగ్గిర తెలుసుకున్నాడు. మర్నాడు వెళ్ళి నిన్ ఫరోసాను రెండు చీవాట్లు పెట్టవచ్చు.

దేశాంతరంలో తనమాట తలపెట్టకండాఉన్న కొడుకుల మీద ఆమె కిపుడు కోపంలేదు. మాటిమాటికీ ఆమాటే

అంటుంది. ఇంతవరకూ వాళ్ళను నిందిస్తూ ఉన్నందుకు నొచ్చుకుంటూ ఉంది. వాళ్ళకు అందే ఉంటాయి అని నమ్ముతూఉన్న ఉత్తరాల్లో ఏ ఒక్కటైనా వాళ్ళచేతిలో పడి ఉంటే మాత్రం వెంటనే వచ్చేసేవాళ్లు తన దగ్గిరికి. ఈ విషయంలో ఆమెకు సందేహమే లేదు.

ముసిల్ది పడే వేదన చూసి డాక్టరు ఓదారుస్తూ చెప్పాడు, మర్నాడు ఉదయం పెద్ద ఉత్తరం వ్రాసి పెడతానని వాగ్దానం చేశాడు. 'వెళ్లు, అయిందేదో అయింది. ఇలా మొత్తుకుంటే ఏం లాభం? ఉదయానే నాదగ్గిరికి రా. ఇప్పుడు వద్దు– ఇది నిద్రపోయేవేళ. ఉదయం రా. వెళ్లు, పడుకో!

కాని లాభం లేక పోయింది. రెండు గంటల తరవాత తిరిగి ఆదారినే ఇంటికి మళ్లుతూ చూశాడు డాక్టరు, దీపం క్రింద కూచొని ముసిల్ది ఘోరంగా ఏడుస్తూఉంది. చీవాట్లు పెట్టి లేవదీశాడు. ఇంటికి వెళ్ళి నిద్ర పొమ్మన్నాడు. అప్పటికి రాత్రి చాలా గడిచింది.

'నీ ఇల్లెక్కడ?'

'అయ్యో, డాక్టరుబాబూ,......ఊరి చివారఉన్న తడికెలు—ఆ ముండకి చెప్పాను, నేను బ్రతికి ఉంటుండగా, నాకొడుకులు తిరిగివస్తే, వాళ్ళకు అది ఇచ్చేస్తానని. విరగపడి నవ్వింది. నాలుగు తడికెలు తప్ప మరేమీలేదు. కాని...'

'సరే, సరే, వెళ్ళు పడుకో. రేపు ఇంటిమాటకూడా రాస్తాలే. పద, నిన్ను దిగబెట్టి వచ్చేస్తాను.'

'మీతల్లికడుపుచల్లగా, డాక్టరుబాబూ, దేవుడు మీకు మేలుచేస్తాడు, అయ్యో, నన్నుమీరు దిగబెడతారా! వద్దు, వద్దు. మీరువెళ్ళండి. పేదముండని, నాతోమీరు రావచ్చా? అదీకాక ప్రాకుతూ నడుస్తానునేను.'

డాక్టరువెళిపోయాడు. కొంచెంవెళ్ళాక మరాగ్రాట్సియా అతణ్ణి అనుసరించింది. అతడు వెళ్ళినగుమ్మందగ్గిరికివచ్చి ఆగింది. చింకిగుడ్డలు ఒంటినిండా కప్పుకుంది. ద్వారంముందు మెట్ల మీద కూచుంది, ముడుచుకొని. రాత్రంతా అక్కడే కాచుకుకూచుంది.

తెలతెలవారుతూఉండగా లేస్తాడుడాక్టరు. 'మార్నింగు వాక్' కోసం బైటికివచ్చి చూశాడు. ముసిల్ది తలుపుకు చేరబడి కునుకుతూఉంది. తలుపుతీసేసరికి డాక్టరుకాళ్ళమీద పడిపోయింది.

'అరే, ఏమిటిది? దెబ్బతగలలేదుకదా!'

'లేదు, ... క్షమించండి డాక్టరుబాబూ!'

అతికష్టంమీద ముడుకులు ఆనుకొని లేచింది ముసల్ది. చేతులు గుడ్డల్లోనే ఉన్నాయి.

'రాత్రంతా ఇక్కడే ఉన్నావా ఏమిటి?'

'చిత్తం, ఇదేమీకాదు. నాకు అలవాటే. ఏంచేసేది డాక్టరుబాబూ, భరించలేకపోతున్నాను. ఆ దండుముండనుంచి నాహృదయం మండిపోతూఉంది. దాన్నినరికెయ్యాలనిపిస్తూ ఉంది. దానికి ఇష్టంలేకపోతే 'రాయను' అని చెప్పేయ్యాలి.

మరెవర్నైయిన ప్రతిమాలుకుందును. మీపాదాలమీదేపడి ఉందును. మీరు దయగల తండ్రులు.'

'సరే, సరే, కొంచెంఆగు. నిన్ఫరోసాపని కొంచెం పట్టించి వస్తాను. ఇపుడే వచ్చేస్తాను. వచ్చేక ఉత్తరం రాస్తాను. ఇక్కడే ఉండు.'

రాత్రి ముసిల్ది చెప్పినదిక్కు డాక్టరు త్వరత్వరగా వెళ్ళాడు. సందులో ఒకయువతిని అడిగాడు, 'నిన్ఫరోసా ఇల్లెక్కడ?' వెంటనే తెలుసుకున్నాడు ఆమె నిన్ఫరోసా అని.

'మీరు వెదుకుతూఉన్న అమ్మాయిని నేనేనండి, డాక్టరుబాబూ!'

చెక్కిళ్ళు ఎరుపెక్కుతూ ఉండగాచెప్పి, మర్యాదగా ఇంటోకి తీసుకువెళ్ళింది.

నూనూగుమీసాలతో, ఎర్రగా బుర్రగా తన గుమ్మం ముందునుంచి డాక్టరు వెళుతూఉండడం అనేకసార్లుచూసింది. ఐతే, ఆమె ఆరోగ్యం ఎప్పుడూ బాగాఉండడంచేత, సుస్తీ మిషపెట్టి ఐనా అతణ్ణి పిలవడానికి వీలుపడలేదు. ఇవాళ తనకోసం కోరి ఇంటికిరావడంచూస్తే సంతోషమేకాదు, చిత్రంగాకూడా ఉంది. కాని, వచ్చినపని వినగానే, కోపమూ విచారమూ కనిపిస్తూఉన్న మొఖం చూడగానే, నిన్ఫరోసామొహం మారింది. అతడుచూసి మెత్తబడేటట్టు వినయంగా, మధురంగా పెట్టింది మొహం. కోపంవచ్చినంతమాత్రాన పోయేదేమీలేదు. ఐనా, తనమీద ఎంతకోపంగా ఉన్నాడో

చూస్తేనే తెలిసిపోతూఉంది. అతడు మాట్లాడుతూ ఉన్నంత సేపూ ఆమె పల్లెత్తిమాటాడలేదు. మర్యాదగా ఎలా ప్రవర్తించాలో ఆమెకు తెలును. కాని, తనకు అవకాశం దొరకడంతోనే చెప్పడం మొదలుపెట్టింది.

'క్షమించాలి, డాక్టరుబాబూ!' మాటాడడం ఆరంభించేసరికి ఆమెఅందమైన నల్లటినేత్రాలు దరనిమీలితాలైనాయి. 'ఐతే, ఆ పిచ్చిది చెప్పిందంతానమ్మి, నిజంగా నామీద మీకు కోపంవచ్చిందా! ఈ ఊళ్ళో దాన్ని ఎరగని వారంటూలేరు. ఎవ్వరూ దాన్నిమాటలు విననైనా వినరు. మీఇష్టంవచ్చిన మనిషిని అడిగి చూడండి. ప్రతివాళ్ళూ చెపతారు. దాని కొడుకులిద్దరూ అమెరికా వెళ్ళిపోయినప్పటినుండీ, పద్నాలుగు సంవత్సరాలైకూడా అది పిచ్చెత్తిపోయింది. ఉత్త వెర్రిముండ. కొడుకులు దాన్ని మరచిపోయారు. కాని, ఆమాట అది పిసరంత ఒప్పుకోదు. ఉత్తరం రాయమంటుంది. వింటున్నారా, కేవలం దాన్ని సంతోషపెట్టడంకోసం ఉత్తరంరాసినట్లు నటిస్తానునేను. ఎవళ్ళచేత ఇస్తుందో వాళ్ళూ 'సరే' అని నటిస్తారు. పాపం, వెర్రిబాగుల్ది, అన్నీ నమ్ముతుంది. లోకంలో అందరూ దానిలాంటివాళ్ళే అయితే ప్రపంచం ఏమౌతుందో ఆలోచించండి. ఇంకావినండీ, నన్నుకూడా విడిచిపెట్టి వెళ్ళిపోయాడు నామొగుడు. నిజంచెపుతున్నాను. డాక్టరుబాబూ, ఆయన కేవలం సిగ్గులేని మనిషంటే నమ్మండి. అక్కడ జతపడ్డ ఓముండతో కలిసి తీయించుకున్న ఫోటో

ఒకటి నాదగ్గిరికి పంపించాడు. చూస్తారా! చేతుల్లో చేతులు వేసుకొని, తలమీద తలఆనించి — ఇవ్వండి మీచెయ్యి చెపతాను — ఇదిగో, ఇలాగ, తెలిసిందా, ఫోటోచూసేవాళ్ళ దిక్కుచూస్తూ నవ్వుతూ ఉన్నారు ఇద్దరూను. అంటే ఏమన్నమాట, మన్ని చూసి నవ్వుతున్నారన్నమాట. అయ్యో డాక్టరుబాబూ, వెళ్ళేవాళ్ళకోసమే అందరూ ఏడుస్తారు. ఇక్కడఉండి బాధపడేవాళ్ళసంగతే ఎవ్వరికీ అక్కర్లేదు. విన్నారూ, వెంబడించి, వెంబడించి నేనూ ఎంతో ఏడ్చాను. ఎలాగో నమాళించుకున్నాను తరవాత. తుదకి ఇపుడు మహా సుఖంగా ఉన్నాను. అవకాశం దొరికినపుడల్లా హాయిగా 'భోగాలు' అనుభవిస్తాను. లోకంలో ఎవరెలాంటివాళ్ళో తెలునుకోవడం ఎంతసేపు చెప్పండీ!' ఈక్రొత్తనేస్తం పరిచయం తీపితో యువ్వనంలో ఉన్న డాక్టరు అదోలా ఐపోయాడు కళ్ళుమూసుకొని అన్నాడు :

'బ్రతకడం కోసం నిజానికి ఉండవలసిన వన్నీ ఉన్నాయి నీకు. కాని, పాపం, ఆపేదముసిల్దానికి—'

'ఏమిటి, దానికా? కావాలంటే దానికి లోపమేలేదు. వండిపెట్టి కాళ్ళముందు నోటికి అందించేవాళ్ళు సిద్ధంగా ఉన్నారు. ఐతే దానికి అవేవీ అక్కర్లేదు.'

'ఏమిటీ?' ఆశ్చర్యంగా చూస్తున్నాడు డాక్టరు.

అతడి అందమైన మొఖంలో ఆశ్చర్యాన్ని చూస్తూ పకా

లున నవ్వింది నిన్ ఫరోసా. ఆనవ్వులోనుండి పల్వరస మల్లె మొగ్గల్లా కనిపించింది.

'నిజం చెబుతున్నాను. దాని కవేమీ అక్కర్లేదు. దానికి మరో కొడుకు ఉన్నాడు. అందరిలోకీ చిన్నవాడు. ముసిల్ది తనదగ్గిర ఉండాలని అతగాడి ఉద్దేశం. అరిచేతిలో నిమ్మ పండులా చూసుకుంటాడు. అన్ని సౌకర్యాలతోను సేవ చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాడు.'

'మరో కొడుకా? ముసిల్దాని కొడుకే?'

'అవును. అతగాడిపేరు రకోక్రృపియా. ఐతే అతడితో ఏమాత్రమూ సంబంధం ఉంచడం ముసిల్దానికి ఇష్టం లేదు.'

'ఎం, ఎంచేత ?'

'చెప్పానుకాదూ, ముసిల్ది కేవలం పిచ్చిది. వదిలేసి వెళ్ళి పోయిన వాళ్ళకోసం రాత్రింబగళ్ళు ఏడుస్తుంది. ఇక్కడ చేతులు జోడించి బ్రతిమాలుతూఉన్న కొడుకును చూడదు. పైవాళ్ళని మెచ్చుకుంటుంది. అదే దానికి సుఖం. కాని కొడుకు దగ్గిరికి వెళ్ళదు. చిల్లిగవ్వైనా అతగాడి దగ్గిర పుచ్చుకోదు.'

పైకి ఆశ్చర్యం కనపడకండా అన్నాడు డాక్టరు :

'బహుశా ముసిల్దానిమీద వాడేదో దౌర్జన్యం చేసి ఉంటాడు.'

'నేనలా అనుకోను,' నిన్ ఫరోసా అంది, మనిషిని చూస్తే మాత్రం కోపిష్టిలా కనిపిస్తాడు. దేనికీ సహజంగా సంతోష

పడడు. కాని మనస్సు మాత్రం మంచివాడు. ఎల్లప్పుడూ పని చేస్తూనే ఉంటాడు. తన పనేదో చూసుకోడం, పెళ్ళాం బిడ్డలతో కాలక్షేపం చెయ్యడం తప్ప అతగాడికి మరో వ్యసనం లేదు. స్వయంగా చూస్తే మీకే బోధపడుతుంది. ఎంతో దూరంలేదు అతగాడిఇల్లు. ఇదిగో చూడండి, ఈ దారినే రెండు ఫర్లాంగులు వెళితే ఊరవతల ఎడమచేతి ప్రక్క ఉందే 'స్తంభం ఇల్లు' అదే అతగాడి ఇల్లు. తోటా, వ్యవసాయం ఘనంగా చేస్తున్నాడు. ఆదాయం కూడా బాగానే ఉంది. వెళ్ళి కనుక్కోండి, నామాట నిజమో అబద్ధమో మీకే తెలుస్తుంది.'

డాక్టరు లేచి బయల్దేరాడు. సంగతంతా విని కుతూహలం పెరిగింది. సెప్టెంబరు నెల పరిమళవాయువులు ఉషారు కలిగిస్తూ ఉన్నాయి.

ముసిల్దాని సంగతి తు చ తప్పకండా తెలుసుకోవాలి.

'తప్పక వెళతాను' అన్నాడు.

వెండి చాకుతో ఉన్న శిగముడిని సవరించడానికి రెండు చేతులూ వెనక్కు మెడమీదికి ఎత్తింది నిన్ ఫరోసా. దర నిమీలితాలైన నవ్వు కళ్ళలో ఆహ్వాన సూచకంగా అంది :

'మీఉద్దేశం శుభప్రదం కావాలి. నాఅవసరం కలిగి నప్పుడు తప్పక తెలియచెయ్యండి.'

వీధిలోకి వచ్చేసి కొంచెం ఊపిరితీసుకోందికి ఆగాడు డాక్టరు. రెండుప్రక్కలా బీదవాళ్ళ తడికెపాకలు. వాటి

తరవాత గ్రామం మరిలేదు. నందు ఊరిపెద్దవీధిలోకి తిన్నగా వచ్చి కలుస్తుంది. కొండక్రింద విశాలమైన మైదానంమీంచి మైలు దూరానికి పైగా పోతుందా దారి, ధూళీదుమారంతో కలిసి. రెండుదిక్కులా పంట పొలాలు. చాలా భాగం కోత లై పోయాయి. అదంతా చొప్ప మొదళ్ళతో పసుప్పచ్చగా ఉంది. ఎడమప్రక్క ఒంటరిగా ఒకపెద్ద దేవదారు వృక్షం గొడుగు విప్పినట్లు అందంగా ఉంది. ఫార్మియాలోని యువకులు సాయకాలం షైరు వచ్చే స్థల మది. మైదానం చివర నీలంగా కొండల వరస కనపడుతూ ఉంటుంది. కొండల వెనక దూది పింజెలలాంటి మేఘాలు తుప్పలలోంచి తొంగి చూస్తున్నట్టుంటాయి. తరుచు మేఘంతరవాత మేఘం అక్కడి నుండి మెల్ల మెల్లగా బయల్దేరి ఫార్మియా మీంచి వెళిపోతూ ఉంటాయి.

దగ్గరికొండ ఎఱ్రగా గంభీరంగా కనపడి, తరవాత ఉజ్జ్వల మైన సూర్యకిరణాల్లో ప్రకాశించింది. ప్రభాతకాలపు మధుర ప్రశాంతం మధ్య మధ్య తుపాకీధ్వనితో భంగపడుతూ ఉంది. అప్పుడే లార్కు పిట్టలు ఆకాశంమీద ఎగరడం ఆరంభిస్తు న్నాయి. లార్కుపిట్టలూ, కపోతాలూ మందలు మందలుగా మైదానంమీంచి ఎగిరిపోతూ ఉన్నప్పుడు కర్షకులు తుపాకీ వేస్తారు. తుపాకీపేలిన ప్రతీసారీ పెంపుడుకుక్కలు మొరగడం చాలాసేపువరకూ వినపడుతుంది. చుట్టుప్రక్కల పండినపైర్లు చూస్తూ త్వరత్వరగా డాక్టరు ముందుకు నడిచాడు. తొలకరి

వానల తరవాతనే పొలాల దుక్కి ఆరంభమౌతుంది. ఐతే ఊళ్ళో వ్యవసాయం చేసిందికి మనుష్యులు లేనేలేరని చెప్పాలి. ఊళ్ళో ఎటు చూసినా డీందీం మంటూ దిగాలుగా ఉంటుంది.

ఎదురుగుండా కనపడింది 'స్తంభంఇల్లు' ఈ పేరుకి కారణం లేకపోలేదు, ఇల్లు ఒకమూల ప్రాచీనమైన ఒక గ్రీకు మందిరం తాలూకు స్తంభాన్ని ఆనుకొనిఉంది. స్తంభంపై భాగం విరిగిపోయి, జీర్ణస్థితిలోఉంది. ఇల్లు నిజానికి ఒకపాక. సిసిలీలోని కర్షకులు 'రోబా' అని వ్యవహరించే పల్లెగుడిసె మోస్తరు. వెనకప్రక్క బ్రహ్మచెముడు పెండె. ఇంటిముందు రెండు గడ్డిమేట్లూ.

'ఎవరున్నారు? ఇంట్లో ఎవరున్నారా?' డాక్టరు గట్టిగా పిలిచాడు. కుక్కలంటే అతడికి భయం. అంచేత వీధిలోనే సగం విరిగి, నాచుపట్టిన గేటుబయటే నిలబడ్డాడు.

దుబ్బులాంటి ఓ తొమ్మిదేళ్ళకుర్రాడు బైటికి వచ్చాడు.

కాళికి జోళ్ళులేవు. నుదుటిమీద పడుతూఉన్న జుత్తూ, మొహం ఎండలో మాడిపోయినట్టుంది. కళ్ళు రెండూ అడివి జంతువులాగ పచ్చగా ఉన్నాయి.

'కుక్కలు లేవుకదా!' అడిగాడు డాక్టరు.

'ఉంది. కాని ఏం చెయ్యదు. మంచిది.'

'నువ్వు రకోర్కి కృపియా కొడుకువా?'

'అవును.'

'మీనాన్న ఎక్కడ?'

'అదిగో, అక్కడ కంచరమీద నుండి గెత్తం దించు తున్నాడు.

పాకగడపలో కూచొని ఉంది కుర్రాడితల్లి ; ఒళ్ళోచంటి కుర్రాడు. పెద్దకూతురు తల దువ్వుకుంటూ ఉంది ; వయస్సు పన్నెండేళ్ళు ఉంటాయి ; జీర్ణించిన బాల్టీమీద కూచుని ఉంది. ఇంకోకుర్రాడు కోడిపిల్లల మధ్య బంగురుతున్నాడు. అవి వాణ్ణి చూసి భయపడడం లేదు. ఒకటిమాత్రం మెడ చాచి జుత్తు దులుపుకుంది.

అమ్మాయిని చూసి డాక్టరు అన్నాడు: 'నేను ఊళ్లో డాక్టర్ని. రక్షోకృపియాతో కొంచెం పనిఉంది.'

కొంచెపు ఆలోచిస్తూ నిలబడిపోయింది తల్లి. తన భర్తతో డాక్టరి కేం పనుంటుందో ఊహించలేకపోయింది. చంటి కుర్రాడికి పాలిస్తూ ఉంది, బాడీ తెరచే ఉంది. తన ముదుక కమీజు దిగదీసి, బొత్తాం తగిలించుకొని కుర్చీ తేవడానికి లేచింది. కాని డాక్టరు కూచోలేదు. నేలమీదఉన్న కుర్రాడి వీపు తడుతూ లాలించడం మొదలు పెట్టాడు. పెద్దకుర్రాడు తండ్రిని పిలవడానికి పరుగెత్తాడు.

రెండు మూడు నిమిషాల్లో నాళ్ళు వేసిన జోళ్ళచప్పుడు వినవచ్చింది. బ్రహ్మచెముడు కంచెలోంచి లోపలికి వచ్చాడు రక్షోకృపియా. అతడి కాళ్ళు రెండూ పొడవుగా, వింటి బద్దలా వంకరగా ఉన్నాయి. ఒక చెయ్యి, వెనక్కు పెట్టు కొని, కర్షకులు సాధారణంగా నడిచేట్టు కొంచెం ముందుకు

వంగి నడుస్తూ వచ్చాడు. పెద్ద చప్పిడి ముక్కూ, వికారంగా ముందుకు వచ్చిన మీది పెదవీ, మిడిగుడ్లూ — ఇవన్నీ కలిసి అతడో వికారంగా కోతిలా ఉన్నాడు. ఎఱ్ఱటి జుత్తు మొహం మీద పడుతూ ఉంది. లోతైన పచ్చని కళ్ళల్లో చలాకీ, చురుకూ కనిపిస్తూ ఉన్నాయి.

నల్లటి నేతటోపీ కొంచెం తలమీంచి పైకి తోసి, ఒక్క చేత్తో డాక్టరుకు వందనం చేశాడు.

'నమస్కారం, ఏమిటి సెలవు ?'

'ఏమీ లేదు' డాక్టరు ఆరంభించాడు, 'మీఅమ్మ విషయంలో కొంచెం మాటాడడానికి వచ్చాను.'

రకోక్కృపియా నెమ్మదిగా అన్నాడు : 'ఆమె కేమైనా జబ్బుచేసిందా ?'

'లేదు, లేదు,' తొందరగా చెప్పాడు డాక్టరు, 'ఆమె ఎలా ఉంధో, అలాగే ఉంది. కాని నీకు తెలుసు కదా, ఆమె ఎంత ముసిలై పోయిందో. ఒంటిమీదికి గుడ్డముక్క లేదు. మరేదిక్కూ లేదామె.'

వింటూ వింటూ రకోక్కృపియాకు చికాకు పుట్టుకు వస్తూఉంది. ఆపుకోలేకపోయాడు.

'మరేమన్నా సెలవివ్వడానికి ఉంటే సెలవివ్వండి, డాక్టరు బాబూ, మీరేదిచెపితే అది చేస్తాను. కాని, మా అమ్మ మాటలు విని వచ్చి ఉంటే మాత్రం, సెలవ్, పనికి పోతాను.'

'విను, ఇందులో నీదేమీ తప్పులేదన్నసంగతి నాకు

తెలుసు,' అతణ్ణి కొంచెం నిలపాలని డాక్టరు అన్నాడు, నేను 'వినకపోలేదు. నువ్వు ఆమెకోసం......'

'ఇటు దయచెయ్యండి; ఇంటి కిటికీ దిక్కు చూపుతూ రకోక్రపియా అన్నాడు, 'ఇల్లు బీదకొంపే, ఐనా, మీరు ఇక్కడి డాక్టరుగారు, ఇంతకంటె మంచికొంపలు ఎన్నో ఊళ్ళో చూసిఉండరు. ఆమంచం చూడండి, మా అమ్మకోసం ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది. ఆమె నాకన్నతల్లి. అంచేత ఆమె విషయంలో చెడ్డమాటలు నోటంబడి రాకూడదు. ఇదిగో చూడండి, వీళ్ళు నాభార్యాపిల్లలు. వీళ్ళని అడగండి, మా అమ్మను భక్తితో సేవించవలిసిందని వీళ్ళకు చెప్తూఉన్నానో లేదో. కన్నతల్లికి భక్తితో సేవచెయ్యడం ధర్మంకదా! గ్రామంలో తిరుగుతూ నామొహం మాడ్చడానికి నేను ఆమె దగ్గిర ఏ అపరాధం చేశానో తెలీదు. లోకం నన్నేమనుకుంటుందో అది భగవంతుడికి తెలియాలి. కాని ఒకటి మాత్రం నిజం. నేను చిన్నప్పటి నుండీ తండ్రికొంపలోనే పెరిగాను పుట్టినప్పటినుండీ మాఅమ్మ నన్ను ఆదరించలేదు. అంచేత ఆమె సేవచేయడమే ఎరగను. ఐతే ఆమెమీద భక్తిమాత్రం మానలేదు. ఎల్లప్పుడూ ఆమె క్షేమమే కోరుతుంటాను. ఆపాడు కొడుకు లిద్దరూ అమెరికా వెళిపోయాక, ఆమెను తెచ్చి ఇంటికి పెద్దగా పెట్టుకోవాలని పరిగెత్తాను. కాని లాభంలేకపోయింది. ఆమె కదిలి నచ్చలేదు. ఊళ్లో ముష్టెత్తుకుందికే ఆమె పంతం పట్టింది. లోకులు నవ్వారు, నామొహం కాలిపోయింది.'

అప్పటినుండీ, ఆ ఇద్దరి కొడుకుల కోసం మేం అనుభవిస్తున్న బాధా, అవమానం, దుఃఖం ఈ జన్మలో మరిచిపోలేను. నిజంగా మీమీద ఒట్టువేసుకు చెపుతున్నాను, డాక్టరు బాబూ. వాళ్ళలో ఎవడైనా, ఎప్పుడైనా, ఫార్నియా తిరిగి వచ్చాడంటే తప్పకండా ఖూనీ చేస్తాను. ఇదిగో నా నలుగురు పిల్లల ఎదటా, నాభార్య ఎదటా నేనిపుడు మాట్లాడుతూ ఉండడం ఎంతనిజమో వాళ్ళను ఖూనీ చెయ్యడం అంతే నిజం. తప్పదు.'

కోపంతో వణుకుతున్నాడు రకోక్రృపియా. మొహం మరింత వికారంగా ఉంది. కళ్ళు రెండూ చింతనిప్పుల్లా ఉన్నాయి. చేత్తో పెదవుల మీది చొంగ తుడుచుకున్నాడు.

డాక్టరు అన్నాడు: 'తెలిసింది. అంచేతనే మీ అమ్మ నీదగ్గిర ఉండిందికి ఇష్టపడ్డం లేదు. అన్నదమ్ముల మీద ఇలా కావేషీ వహించడం చేతనే ఆమె ఇక్కడికి రాదు. రహస్యం బోధపడింది.'

'కావేషీయా?' పిడికిలి పట్టిన చెయ్యి వెనకనుండి తీస్తూ, హుంకరిస్తూ అన్నాడు రకోక్రృపియా, 'అవును డాక్టరు బాబూ, ఇపుడు కావేషీయే వహిస్తున్నాను, మాతల్లి దురవస్థకీ, మాదుర్దశకీ మూలకారణం కావడంచేత వాళ్ళమీద పగపడుతున్నాను. కాని, వాళ్ళిక్కడ ఉన్నప్పుడు, అన్నలుగా వాళ్ళని ప్రేమించేవాణ్ణి. వాళ్ళూ నన్ను స్నేహంగా చూసేవాళ్ళు. వినండి, వాళ్ళిద్దరూ ఏపనీ చేసే

వాళ్ళు కాదు. వాళ్ళకోసం నేను ఒక్కణ్ణే కష్టపడేవాణ్ణి. వాళ్ళు వచ్చి చెప్పేవాళ్ళు రాత్రి తిండికి ఏమీ లేదనీ, అమ్మ ఉపవాసం ఉండవల్సి వస్తుందనీ చెప్పేవాళ్ళు నాతిండిలోంచి తీసి ఇచ్చేసేవాణ్ణి. వాళ్ళు తప్పత్రాగేవాళ్లు. సానికొంపల్లో దూరేవాళ్ళు. — వాళ్ళు అమెరికా వెళ్ళినపుడు నాదగ్గిరఉన్న దంతా వాళ్ళకి ఇచ్చేశాను. ఇదిగో, నాభార్యను కనుక్కోండి; ఆమెనోటంబడే అన్నీ వినండి.

'ఐతే, మరేమిటి కారణం?'

'కారణం? కారణం మా అమ్మ చెపుతుంది. నేను ఆమెకు పుట్టలేదట!'

'ఏమిటీ?'

'ఆమెనే అడగండి. నాకు తీరిక లేదు. కంచర్ల మీద గత్తం పెట్టుకొని మా మనుషులు నిలబడి ఉంటారు...... ఈమాటలుభరించ లేను మరి. డాక్టరుబాబూ, ఆమెనే కను క్కోండి. సెలవ్, నమస్కారం.'

ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు రకోక్కృపియా; వెనకాల ఓ చెయ్యిపట్టుకొని, గూనిగా వంగుతూ. అతగాడి పొడవాటి కాళ్ళురెండూ వింటిబద్దలా వంకరగా ఉన్నాయి. డాక్టరు చూపులు కొంతదూరం అతణ్ణి అనుసరించాయి. తర వాత పిల్లలదిక్కు తిరిగాయి. వాళ్ళు తెల్లబోయి చూస్తు న్నారు, భయంతో. తల్లి అదోలాగ చేతులు నులుపు కుంటూ

నిలబడింది. చివరికి కళ్ళుమూసుకొని నిస్సహాయమైన నిట్టూర్పుతో అంది.

'దేవుడిదే భార మంటాను, అంతకంటే ఇంకో ఆధారం లేదు.'

డాక్టరు వెళ్ళిపోవచ్చాడు. నమ్మడానికి వీల్లేని ఈకథలోని రహస్యం తెలుసుకోవాలని కుతూహాలం మరింత హెచ్చింది. గుమ్మం ముందు ముసిల్ది అలాగే కూచొని ఉంది. ఆమెను చూచి డాక్టరుకు చికాకు కలుగుతూ ఉంది.

'నీకొడుకుతో మాట్లాడి వచ్చాను. ఈ ఊళ్లోనే మరో కొడుకు ఉన్నసంగతి చెప్పావుకావేం?'

మొదట జలదరించి పోయినట్లయింది, తరవాత భయంతో చూస్తూ ఉండిపోయింది మరాగ్రాట్సియా. నుదుటి మీాద, జుత్తుమధ్య వణుకుతూఉన్న చేత్తో నిమురుతూ జవాబు చెప్పింది.

'వాడిమాట వింటేనే నాప్రాణాలు ఎగిరి పోతాయి. డాక్టరు బాబూ, దయచేసి వాడిసంగతి ఎత్తకండి!'

'ఎంచేత?' కోపంగా అడిగాడు డాక్టరు, 'వాడు నీకేం అపకారం చేశాడని, చెప్పు. చెప్పాలి.'

'వాడేమీా చెయ్యలేదు; త్వరత్వరగా చెపుతూ ఉంది ముసిల్ది, 'నిజం చెపుతున్నాను' వాడేమీా అపరాధం చెయ్యలేదు; మీాదు మిక్కిలి ఎపుడూ మంచిగానే ఉంటున్నాడు. కాని, నేను – నేను, విన్నారూ డాక్టరుబాబూ, ఆమాట

వినేటప్పటికే నాచేతులు ఎలావణుకు తున్నాయో చూడండి. ఆసంగతి నోటితో చెప్పలేను నేను. ఏమంటారా? ఏముంటే. వాడు - వాడు నాకొడుకు కాడు.'

డాక్టరు తల పిచ్చెత్తి నట్లయింది.

'ఏమిటి, తెలివి తక్కువగా పేల్తున్నావ్?—వాడు నీకొడుకు కాడూ? ఏమిటి చెపుతున్నావ్ నువ్వు! నీకు తల తిరుగుతూ ఉందా, లేకపోతే పిచ్చెత్తిందా? వాడు నీకు పుట్టలేదూ?'

డాక్టరు కోపం చూసి ముసిల్ది తల వంచుకుంది. ఎర్రటి కనురెప్పలు క్రిందికి సగం వాల్చి చెప్పింది.

'బాబూ, అవును, నేను తెలివితక్కువదాన్నే. పిచ్చిదా న్నంటారా, కాదు అయ్యో దేవుడా, పిచ్చెత్తిపోయి ఉంటే బావుండేది. ఈ నరకయాతన అనుభవించేదాన్ని కాదు. కాని బాబూ, మీాది కేవలం బాల్యం. ఇందులో ఎంతో కథ ఉంది. మీాకు సరిగా అర్థంకాదు. నాతల పండిపోయింది. అనేక దినాలనుండి అనేక కష్టాలు అనుభవించాను. అనేకం చూశాను.— నేను చూసినవి ఇవుడు మీారు ఊహించనన్నా ఊహించలేరు.'

'ఏమిటవి? ఏమిటి చూశావు?'

కొంచెం దబాయిస్తూ అన్నాడు డాక్టరు.

'భయంకరమైనవి, ఘోరమైనవి.' ఆమె దుఃఖం ఉప్పొంగి పోతున్నట్టుంది. 'అప్పటికి మీారు పుట్టలేదు, మీాసంగతి కలలోకూడా ఎవ్వరూ ఊహించి ఉండరు. అంత

ముందు కాలం మాట. ఈ కళ్ళతో చూశాను నేను......
అప్పటినుండే నాగుండెల్లో రక్తం నీరై పోయింది — మీరు కానేబార్డో * మాట ఎపుడన్నా విన్నారా ?'

'గారిబాల్డి ?' ఆశ్చర్యంగా అడిగాడు డాక్టరు.

'అవును, కానేబార్డో, మా దేశానికి వచ్చి, పట్నాలని కాదు, పల్లెలని కాదు, అన్నిచోట్లా మనుష్యులకూ, భగవంతుడికీ విరుద్ధంగా, ప్రతీ నియమానికీ, ప్రతీ శాసనానికీ విరుద్ధంగా విప్లవం లేవదీశాడు. ఇది మీరు వినేఉంటారు.'

'ఆఁ, ఐతే, గారిబాల్డీతో ఈవిషయానికి సంబంధమేమిటి?'

'సంబంధం ఉంది బాబూ వినండి, మీకు తెలిసే ఉంటుంది, కానేబార్డో వచ్చి పట్నాల్లోని జైళ్ళన్నీ పగలగొట్టాడు. మీరే ఆలోచించండి, మన దేశంలో ఎలాంటి అరాచకం చెలరేగి ఉంటుందో! కేవలం మృగాలైన వాళ్ళని, హంతకులైన వాళ్ళని, బందిపోటు దొంగల్ని, సంవత్సరాల తరబడి జైళ్ళకు వెళ్లే వాళ్ళని ఒక్కసారి వదిలేశాడు. స్వేచ్ఛగా బైటికి వచ్చేశారు వాళ్ళు. వాళ్ళల్లో అందరికంటె ఘోరమైనవాడు కోలాకామిజ్జ్ బందిపోటుగుంపు నాయకుడు. ఎదటపడ్డవాళ్ళని దోమల్లాగ చంపి పారేసేవాడు. 'తుపాకీ సరిగా ఉందోలేదో తూటా పేల్తుందోలేదో చూడ్డానికోసం వీళ్ళని చంపాను. అంతే మరేమిటి?' అనేవాడు. ఇలా వెళ్ళేటపుడు ఫార్మియా మధ్యనుండి వెళ్ళాడు. వెంట వందలకొద్దీ ఉన్నారు. అందరూ

* గారిబాల్డీని సిసిలీప్రజలు కానేబార్డో అంటారు.

కర్షకులే. వాళ్ళతో వాడు తృప్తిపడ లేదు. గుంపు పెద్దది చేయడం కోసం జనం వెదుకుతూ ఉండేవాడు. వాడి నాయకత్వం అంగీకరించనివాణ్ణి చంపేసేవాడు. అప్పటికి కొద్ది సంవత్సరాలక్రింద నా వివాహమైంది. ఇప్పుడు అమెరికాలో ఉన్న ఇద్దరు కొడుకులూ అప్పటికి పుట్టి ఉన్నారు. కోలాకామిజ్జీ నాభర్తను తీసుకుపోయాడు. బలవంతంగా లాక్కుపోయాడు. రెండు దినాల తరవాత నాభర్త తిరిగి వచ్చేశాడు. ముఖం శవంలాగ మాడిపోయివుంది. పోలికలేకుండా అయిపోయాడు. మాటలు తడబడుతూ ఉన్నాయి. కళ్ళల్లో భయమే భయం. చేతులు రెండూ పైకి ఎత్తి ఉంచాడు. బలవంతంగా ఆ చేతులతో చేసిన ఘోరాలు తలచుకుంటూ, అసహ్యించుకుంటూ, పైకెత్తి పట్టుకున్నాడు. 'ఏమటి చేశావు?' అని అడిగాను. ఏమీ చెప్పలేకపోయాడు. 'అయ్యో, పారిపోవచ్చావా? మళ్ళీ పట్టుకుంటే ఏమౌతుంది! చంపేస్తాడు.'

ఏమౌతుందో అని వ్యాకులంగా ఉంది. తలవంచుకుని మాటాడకండా పొయ్యిదగ్గిర ముడుచుకు కూచునే వాడు. 'దీనికంటె చావే నయం' అన్నా డొకనాడు. అంతే. మూడు దినాలు అలా దాగున్నాడు. నాల్గోనాడు పైకి వెళ్ళాడు. బీద వాళ్ళం, పనిచెయ్యకపోతే ఎలా గడుస్తుంది గనక. పొలానికి పనిలోకి వెళ్ళాడు. సాయంకాలమైంది. రాలేదు. నేను కాసుకు కూచున్నాను. ఎలాంటిభావాలతో కూచున్నానో భగవంతుడికే తెలియాలి. చివరికి తెలుసుకున్నాను. అంతా తెలిసింది.

ఐనా ఆచోచించాను. ఏమో, ఎవరుచెప్పగలరు? బహుశా చంపకపోయి ఉండవచ్చు. ఊరికే పట్టుకుపోయి ఉండవచ్చు. ఆరురోజులు తరవాత తెలిసింది, కోలాకామిజ్జీ తనగుంపుతో మారిశెలుసామేనర్‌లో ఉన్నాడని, ఆస్థలం గ్వోరియన్ సాధువుల్ది. వాళ్ళక్కడినుండి పారిపోయారు. పిచ్చి దానిలా అక్కడికిబయల్దేరాను. అవాళ భయంకరమైనతుఫాను. అలాంటి తుఫాను జీవితంలో ఎన్నడూ చూడలేదు. మీా రెపు డయినా గాలిని కళ్ళతో చూశారా? అవాళనిజంగా చూడ గలిగేవారు. హత్యచేయబడ్డవాళ్ళ ఆత్మలు, మానవులతోనూ దేవతలతోను, మొరపెడుతూ ఉన్నట్టుంది, ప్రతీకారంకోసం. ఆతుఫానులోనే బైల్దేరాను. గాలినన్ను ఎగరవేస్తూ తీసుకు వెళ్ళింది. తుఫాను నన్ను కుదవేస్తూ నడిచింది. నాఏడుపులు తుఫాను శబ్దాన్ని మించికూడా వినబడ్డాయి. ఎగిరిపోతూనే వెళ్లాను. ఒకగంటకూడా పట్టలేదు అక్కడికి చేరడానికి. తుప్పలలోనుండి చాలమెత్తుకు వెళ్లాను. చుట్టూప్రాకారం. ఇప్పటికీ నాకు జ్ఞాపకం ఉంది, తుప్పలమధ్య చిన్నద్వారం నుండి లోపల ప్రవేశించేదారి. చెట్లవ్రేళ్ళు గోడలనుండి పైకి వచ్చేస్తూ ఉన్నాయి. గట్టిగా తలుపు కొట్టిందికి ఒకరాయి తీసిపట్టుకున్నాను. తలుపు అదేకొట్టడం ఆరంభించాను. కాని ఎంతచేసినా తలుపు తెరవలేదు. నేనుకొట్టడం మానలేదు. చివరికి తెరిచారు. ఓయి దేవుడా! లోపల ఎంతభయంకర మైన దృశ్యం!—

మరా(గ్రాట్సెయా లేచి నిలబడింది. భయంతో మొహం ముడుచుకు పోయింది. ఎర్రని కళ్లల్లో కాతరపుచూపు. ఒక చెయ్యి చాచింది. (వేళ్ళు బిగుసుకుపోయి ఉన్నాయి. కంఠం విడడంలేదు. మఱిమాటాడలేకపోయింది.

'వాళ్ళ చేతుల్లో—' కొంతసేపలాగే ఉండి, తరవాత ఆరంభించింది, 'వాళ్ల చేతుల్లో, ఆరాక్షసుల చేతుల్లో......వాళ్ళ చేతుల్లో......'

మళ్ళీ ఆగిపోయింది. ఎవరో ఆమెగొంతుక రెండు చేతుల్తో నొక్కేస్తూ ఉంటే విడిపించుకుందికి గింజుకున్నట్టుగా మెడ చేసింది.

డాక్టరు శరీరం గలపొడిచింది. 'తరవాత' అన్నాడు.

'తలకాయలతో — మానవశిరస్సులతో వాళ్ళు చిందులు త్రొక్కుతున్నారు. నేలమీద, ధూళిలో పొర్లాడుతున్నవి మానవశిరస్సులు, నల్లనల్లటి తలకాయలు, జుత్తులు పిడికిళ్ళతో పట్టుకున్నారువాళ్ళు. ఆ శిరస్సులలో ఒకటి నాభర్తది. కోలాకామిజ్జీ స్వయంగా నాభర్తతలకాయ పట్టుకున్నాడు. — నాకుచూపించాడు. గుండెలు బద్దలైపోయాయి. గొంతుక చీల్చుకుంటూ ఆర్తనాదం చేశాను. నారక్తం నాలోంచి పగిలి పైకివచ్చేసేటంత గట్టిగా అరిచాను. ఆపడంకోసం కోలాకామిజ్జీ నాగొంతుకనొక్కి పట్టుకున్నాడు. వెంటనే గుంపులోంచి ఒకడు, పిచ్చివాడిలావచ్చి వాడిమీాదికి తల పడ్డాడు. దాంతో సాహసించి నలుగురైదుగురు, బహుశా

పదిమంది చుట్టూ వాణ్ణి ముట్టడించి పట్టుకున్నారు. ఆరాక్షసుడి ఘోరాలు సయించి సయించి బేజారైపోయారు వాళ్ళు. అంచేతనే తిరగబడ్డారు. విన్నారా డాక్టరుబాబూ, నాకళ్ళ ఎదటే వాడితలకాయ తెగనరకడం చూసి ప్రాణం కొంచెం చల్లబడింది.'

అలిసిపోయింది ముసిల్ది. ఎగపోస్తూఉంది. అప్రయత్నంగా ప్రక్క-కుర్చీలో కూలబడిపోయింది. శరీరం ఆపాదమస్తకం జలదరిస్తూఉంది. డాక్టరు ఆమెనుచూస్తూ ఉన్నాడు. జాలీ, భయం అతనిచూపుల్లో పెనవేసుకుంటూ ఉన్నాయి. క్రమంగా సహజస్థితిలోకివచ్చి ఆలోచించాడు. కాని, ఈ ఘోరమైన కథకూ ఆమె మరోకొడుక్కీ సంబంధ మేమిటో బోధపడలేదు. స్పష్టంగా తెలుసుకుందికి అన్నాడు:

'ఊఁ, తరవాత ?'

కొంచెం ఊపిరితీసుకొని ముసిల్ది ఆరంభించింది. 'ఎదిరించి నన్ను రక్షించడానికి వచ్చాడే వాడిపేరు మార్కో-కృపియో.'

'ఓహో!' ఆశ్చర్యపోతూ అన్నాడు డాక్టరు, 'ఐతే, 'రక్కో...'

'వాడి కొడుకే,' మరాగ్రాట్సియా జవాబు చెప్పింది, 'డాక్టరు బాబూ, బాగా ఆలోచించి చూడండి. నే నెలాంటి అవస్థలో వెళ్ళానో, అలాంటి స్థితిలో వాణ్ణి పెళ్ళాడతాననే మీరు అనుకుంటారా? నాకోసం వాడు ప్రాకులాడడం మొదలెట్టాడు. మూడు మాసాలు నన్ను ఉంచుకున్నాడు. నేను

కేకలు వేయకుండా, కరవకండ నానోరు కట్టేసి ఉంచే వాడు... మూడు మాసాల తరవాత వాణ్ణి గవర్నమెంటు పట్టుకొని జైల్లో వేశారు. కొన్నాళ్ళకి జైల్లోనే చచ్చిపోయాడు. ఐతే, అప్పటికి నేను పురటాలు పడ్డాను.

డాక్టరు బాబూ, మీఒళ్ళు ముట్టుకు చెపుతున్నాను, నా లోపలిభాగం ఊడపెరికి పారెయ్యా లనిపించేది. ఒక రాక్షస సంతానం నాకడుపులో పెరుగుతూ ఉన్నట్టుండేది. ఒక రాక్షస బిడ్డను కనబోతూ ఉన్నట్టుండేది. వాడి చేతుల్లోంచి తప్పించుకునే మార్గం కనపడలేదు. శిశువును ఎంతమాత్రమూ ముట్టనైన ముట్టలేననిపించేది. ఆబిడ్డకి పాలివ్వవలిసి వస్తుందన్న భావం తలలో వెర్రెత్తినట్టు ఉండేది. చావు కేకలు వేసే దాన్ని. వాడు పుట్టినపుడు ఒక పిసరంతలో చావు తప్పి పోయిందినాకు. మాఅమ్మ వాణ్ణి ఎత్తిదించడం చేసేది. పిల్ల వాణ్ణి నాకంట పడనియ్యలేదు. పుట్టీపుట్టడంతో తిన్నగా తండ్రి ఇంట్లో విడిచి వచ్చింది. అక్కడే వాడు పెరిగాడు. ఇపుడు చెప్పండి మీరే, డాక్టరు బాబూ, వాడు నాకొడుకు కాడంటే అబద్ధమా ? '

ఏదో ఆలోచిస్తూ ఉన్నట్టు మగ్నంగా ఉన్న డాక్టరు మొదట ఏమీ జవాబు చెప్పలేదు. తరవాత అన్నాడు :

' కాని, ఏమైనా వాడు నీకొడుకే కదా ! వాడి తప్పు మాత్ర మేముంది ? '

' ఏమీలేదు ' ముసిల్ది చెప్పింది, ' వాణ్ణి నేనెప్పుడూ

నిందించను. నిజం చెపుతున్నాను, వాణ్ణి మెచ్చుకుంటాను కూడా. కాని దూరం నుంచి వాణ్ణి చూస్తేనే నేను సహించ లేను. ఏం చెయ్యమన్నారో చెప్పండి మరి. వాడు సరిగ్గా వాడి తండ్రిలాగే ఉన్నాడు—మొహం, ఆకారం, గొంతుకా అన్నీ మూడు మూర్తులాను. వాణ్ణి చూసేసరికి నాగుండె లార్చుకుపోతాయి. ప్రాణా లెగిరిపోతాయి. నామతిపోతుంది. నా తలమీద నిప్పులు కురుస్తాయి. నేనేం చేసేది, మీరే చెప్పండి ?...'

ముసిల్ది చేతి మండలతో కళ్ళు తుడుచుకుంది. ఇంతలో ఫార్మిసీయానుండి వెళుతూ ఉన్న వాళ్ళు తన కొడుకుల దగ్గిరికి ఉత్తరం తీసికెళ్ళకండా వెళిపోతారేమో అన్న భయం కలుగుతూ ఉంది. ఏదో ఆలోచిస్తూ ఉన్నట్టుగాఉన్న డాక్టరుతో సాహసించి దీనంగా అంది : 'మీరు దయతో చేసిన వాగ్దానం...'

ఒక్క ఊపుతో తన ఆలోచనలన్నీ దులిపేసుకున్నట్టు లేచాడు డాక్టరు. టేబిలు దగ్గిరసా కుర్చీ లాక్కున్నాడు. సిద్ధంగా ఉన్నట్టుగా చూశాడు కలం పట్టుకొని. బంగారు గొంతుకతో ముసిల్ది ఆరంభించింది :

'నాకుమారులారా ?... '

---

# పల్లె — పట్నం

ఇప్పటిలాగే ఐదోశతాబ్దంలోకూడా ఉదయాస్తమానాలు జరుగుతూ ఉండేవి. ప్రథమసూర్యకిరణాలు మంచు ముత్యాలను చుంబించడంతో విశ్వం సజీవమై లేచేది. గాలి ఆశతో, ఆనందంతో పులకించేది. సాయంకాలంకాగానే మళ్ళీ నిశ్శబ్దం ఆవరించేది. ప్రకృతి అస్పష్టమైన అంధకారంలో మునిగిపోయేది. మొదటిరోజు వంటిదే ఇంకోటి, మొదటిరాత్రి వంటిదే మరొకటి.

అపుడపుడు పరిగెత్తేమేఘాలూ, మెరుపులగర్జనా ఆకాశంలో ద్యోతక మయ్యేవి. ఒక్కొక్కపుడు అజాగ్రత్తగా ఉన్న నక్షత్రం ఏదైనా రాలి పోయేది. మునిపల్లెలో ఎవరో ఒక ముని వచ్చి "దగ్గరలోనే ఒక పులిని చూశాను" అని చెప్పేవాడు. ఈప్రకారంగా దినాలు వెళ్ళిపోతూఉండేవి.

సన్యాసులు వాళ్ళ వాళ్ళ పనులు చేసుకునేవాళ్ళు; ఉపాసన సాగించేవాళ్ళు. వాళ్ళ గురువు వాయిద్యాలు ప్రయోగించేవాడు. లాటిన్ భాషలో కవిత్వం కట్టేవాడు. కీర్తనలు పాడేవాడు. అతని శక్తి అద్భుతమైంది. అతని వాయిద్యాలు వింటేచాలు — మృత్యుశయ్యమీాద ఉండే శతవృద్ధులు కూడా కన్నీళ్ళు నిలపలేకపోయేవాళ్ళు.

చెట్లు చేమలు గురించికాని, అరణ్యమృగాల విషయంలో కాని, సముద్రం గురించికాని అతడు ప్రసంగించాడా అంటే

చిరునవ్వో, అశ్రుపాతమో శ్రోతల్లో రావలిసిందే. వాయిద్యంతో అతని కంఠంనుండి వెలువడే స్వరాలు అతని ఆత్మనుండి వెలువడుతూ ఉన్నట్లుండేవి. ఉద్రేకంతోనో, ఉత్సాహంతోనో అతడు ప్రసంగించేసేటప్పుడు అతనిలో ఒక ఉత్తేజం కనిపించేది. అతని ఉజ్జ్వలనేత్రాలు అశ్రుపూరిత మయేవి. శిష్యగణం మంత్రముగ్ధులవలెనె గురువు వంటి అనుభవమే పొందేవాళ్ళు.

అలాంటిసమయంలో గురువుగారి ప్రభావముద్ర వాళ్ళమీాద అనంతంగా పడేది. 'సముద్రంలో ఉరకండి' అంటే వాళ్ళు అపుడు వెనుదీయరు.

భగవంతుణ్ణి స్తుతించే అతని కవిత్వంలో, గానంలో, కంఠంలో వాళ్ళకు అనంతమైన మహానందం లభించేది. ఐతే ఏమార్పూ లేకండా, పాడిందే పాడరా అన్నట్టు, ఒకేరకమైన జీవితంవల్ల విసిగిపోయి ఒక్కొక్కప్పుడు చెట్లూ, పువ్వులూ, వసంతం, సాగరతరంగాలూ, పక్షుల కిలకిలారావాలూ వాళ్ళకు అసహ్యంగా తోచేవి. కాని, గురువుగారి సుగుణసంపత్తి, అతని భౌతిక దేహమూ వారికి ప్రాణవాయువువలె అవసరంగా ఉండేవి.

పదులు పదులుగా సంవత్సరాలు గడిచిపోయాయి. పగలూ, రాత్రీ ఎప్పటిలాగే వస్తూ పోతూ ఉన్నాయి. ఒకదినం మరో దినంలాగే ఉంది. ఒకరాత్రి ఇంకోరాత్రిలాగే ఉంటున్నది. పక్షులూ, వన్యమృగాలూ తప్ప ఆశ్రమం ప్రక్క కొత్తవ్యక్తి

కనిపించడంలేదు. దగ్గర అనుకునే, పట్నం వెళ్లాలంటే డబ్భై మైళ్ళ ఎడారిదాటాలి. బ్రతుకు మీద అసహ్యాం వేసిన వాళ్ళూ, గృహాలను స్మశానంగా భావించేవాళ్ళూ మాత్రం ఎడారి దాటడానికి సాహసించి మునిపల్లెకు వచ్చేవారు.

ఒకనాడు సన్యాసులలో ఆశ్చర్యం కలిగించే విషయం జరిగింది. ఒకకొత్తవ్యక్తి వాకిట ప్రవేశించాడు. అతడు పట్నం మనిషి. అతిసామాన్యుడు, పాపి. ప్రాణమంటే తీపి. ప్రార్థన చేయకండానే, గురుదేవుని ఆశీర్వాదం పొందకుండానే, సారాయీ, రొట్టె అడిగాడు. "పట్నంనుండి ఎలావచ్చావు ?" అంటే అతడు చెప్పిన జవాబిది: 'వేటకు బయల్దేరాను. గంగా సాగరం కొంచెం అధికంఅయింది. నిషాలో దారితప్పిపోయాను.

"ఆశ్రమంలో చేరి ఆత్మను ఉద్ధరించుకోరాదూ !" అంటే "నేను మీతో ఉండడానికి తగను." అని చిరునవ్వుతో చెప్పాడు.

భోజనానంతరం తనకు ఉపచారాలూచేస్తూ ఉన్న సన్యాసులను చూసి పట్నంమనిషి విచారంతో ఇలా అన్నాడు. "మీరు సోమరిపోతులు. తిండికితప్ప మరెందుకూ పనికిరారు. ఆత్మోద్ధారం ఇలాగేనా చేస్తారు ? మీరిక్కడ మస్తుగా భోజనంచేస్తూ, అందమైన కలలుకంటూ బ్రతుకుతున్నారు సుఖంగా. మీ పొరుగువాళ్ళు ఆకలి మంటలతో చస్తూ, నరకానికి పోతున్నారు. పట్నంలో ఏంజరుగుతూ ఉందో మీకు తెలుసా ? అక్కడ కొందరికి తమధనం ఎలా వినియోగించడమో తెలీదు. ఈగలు పంకంలో తలుగు

కొన్నట్లు, పాపంలో మునిగి సర్వదుంబాలా ఐపోతున్నారు. అక్కడి మానవులలో విశ్వాసం లేదు. సత్యం లేదు. వాళ్ళని ఉద్ధరించే బాధ్యత ఎవళ్ళదంటారు? నావంటి త్రాగుబోతులది కాదుకదా? పనీ పాటూ లేకండా కాలం వెళ్ళబుచ్చడానికేనా మీలో కోమలస్వభావం, కలుపుగోరుతనం, ఈశ్వరభక్తి భగవంతుడు ప్రసాదించాడు?"

* * *

పట్నంమనిషి చెప్పిన మాటలు అమర్యాదగానూ, అసందర్భంగానూ ఉన్నా గురువుగారిమీద వీటి ప్రభావం బాగా పనిచేసింది. అతడు శిష్యులను చూశాడు. వాళ్ళ మొగాలు వాడిపోయాయి. గురువు చెప్పాడు:

"తమ్ములారా! ఇతడు చెప్పింది నిజం. ప్రజలు తమ దౌర్బల్యంవల్లా, అజ్ఞానంవల్లా, అవిశ్వాసంచేతా పాపంలోపడి నాశనమైపోతూఉన్నారు. ఇంత అయినప్పటికీ మనకేమీ సంబంధమే లేనట్లు మనం కదలకండా ఊరుకుంటున్నాం. నేనువెళ్ళి ఆ దయామయుని పవిత్రసందేశం వాళ్ళకెందుకు జ్ఞాపకం చెయ్యకూడదూ అంటాను!"

పట్నంమనిషి మాటలు గురువుగారి కాళ్ళకు పని కలిగించాయి. మర్నాడు ప్రాతఃకాలం శిష్యుల అనుమతి పొంది చేపాటికర్రతో గురువు బైల్దేరాడు. శిష్యులకు అతని సంగీతం, ఉపదేశం కొరతపడింది. ఈవిధంగా నీరసమైన జీవితం వాళ్ళు

గడపవలసి వచ్చింది. ఎలాగో నెల గడిచింది. మరో నెలకూడా గడిచింది. మునలిగురువు రాలేదు.

మూడు మాసాలు గడిచాయి. చివరికి ఓనాడు తమ చిరపరిచితమైన గురువుగారి చేపాటికర్ర శబ్దం వినపడింది. శిష్యులు స్వాగతం ఇవ్వడానికి పరుగెత్తారు. ఒక్కుమ్మడిని అనేక ప్రశ్న పరంపరలు కురిపించారు. వాళ్ళనుచూచి సంతోషించడానికి బదులు గురువు వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టాడు. ఒక్కమాట కూడా పలకలేదు. ఎన్నో ఏళ్ళు గడిచిపోయి నట్లు ముసలిగా, దుర్బలంగా మారిపోయి ఉన్నాడు. కపాలం ముడతలు పడిపోయింది. ముఖం విషాదంగా ఉంది. అతడి మీద అనేక అత్యాచారాలు జరిగినట్లు అతడి ఏడుపువల్ల వ్యక్తమౌతూఉంది. శిష్యులుకూడా ఏడ్చారు. సానుభూతితో ప్రశ్నించారు.

"దేవా! నీకోదనకు కారణ మేమిటి? నీవదనం ఇంతగా వాలిపోయిం దెందుకు?"

కాని గురువు ఎవ్వరితోనూ మాటాడకుండా తనగదిలోనికి పోయి తలుపు మూసుకున్నాడు. వారందినాల వరకూ ఉపవాసం చేశాడు. కేవలం ఏడవడం తప్ప వాయిద్యాలు కూడ ముట్టుకోలేదు. శిష్యులు ద్వారందగ్గిర తలుపు తట్టే వాళ్ళు, బైటికి దయచేయవలసిందని ప్రార్థించేవాళ్ళు. 'మీ దుఃఖంలో పాల్గొననీయవలసింద'ని కోరేవాళ్ళు. కాని వృద్ధుడు మాటాడలేదు.

చివరికి ఓనాడు బైటికి వచ్చి శిష్యులందర్నీ సమావేశ పరచాడు. కన్నీళ్ళతో, దుఃఖగద్గదకంఠంతో గడచిన మూడు మాసాల చరిత్ర చెప్పడం మొదలుపెట్టాడు. ఆశ్రమం నుండి బైయలుదేరి పట్నం చేరినంత వరకూ అతని కంఠం శాంతంగా ఉంది. కళ్ళు మెరుస్తున్నాయి.

"మార్గంలో పిట్టల మధురగానాలూ, నదుల కలకలా రావాలూ విని నాహృదయంలో నూతనోత్సాహం పరుగెత్తింది. యుద్ధానికి వెడుతూఉన్న వీరునిలా నాకనిపించింది. నావిజయంలో సందేహమే కనిపించలేదు. ఈవిధంగా అనేక కల్పనలతో, కవిత్వం కడుతూ, పాడుతూ ప్రయాణం ముగించాను."

పట్నం గురించి చెప్పేటప్పుడు అతని కంఠం వణకడం ఆరంభించింది. కళ్లు చింతనిప్పులులా ఎర్రబడ్డాయి.

"నేను పట్నంలో చూచిన విషయాలు ఏనాడూ చూసి ఉండలేదు. చూడాలని స్వప్నంలో కూడా అనుకోలేను. మానవుడు ఎంతవ్యర్థమైనవాడో, ఎంత అసహాయుడో, పాపం ఎంత ఆకర్షణగలదో, సైతాను ఎంత శక్తివంతుడో నాముసలితనంలో నేను ఇదే తొలిసారి చూడడం. నేను మొదట ప్రవేశించిన గృహం దౌర్భాగ్యవశాత్తూ ఒకదురాచారాల కూటం. సుమారు ఇరవైమంది ధనవంతులు విందులో ఉన్నారు. గంగాసాగరం సీసామీదసీసా ఖాళీ ఐపోతూ ఉంది. నిషాలో వాళ్ళు వొళ్లుమరచి పాటలు: పాడుతున్నారు

దైవభీతికలవా డెవడూ నాలికమీదికి తేరాని దుర్భాష లాడు తున్నారు. వాళ్లు స్వేచ్ఛాజీవులు. అహంభావులు. ఆనందం తప్ప ఇతరం ఎరగరు. దేవుడూ దెయ్యం వాళ్ళకు లేరు. మృత్యువునుకూడా లెక్క చెయ్యరు. వాళ్ళ రంగేళీ మనస్సు ఎటు పరిగెడితే అటు విహరిస్తారు. ఆకాశంలా నిర్మలమూ, బంగారంలా ధగద్ధగాయమానమూ ఐన సారాయి వాళ్ళకు ప్రాణం. దాన్ని చవిచూచిన ప్రతీవాడూ ముసిముసినవ్వులు కురిపించాడు. ఇంకా, ఇంకా - మరో, గ్లాసుకోసం చేతులూ పెదవులూ చాచాడు. కల్లు ముచ్చుల చిరునవ్వులు చూసి కల్లుకుండలు కూడా చిరునవ్వులు నవ్వాయి. తాగేటప్పుడు సారాయి మరింత మెరిసింది. తనభక్తులు ఆరాధించడం వల్ల గర్వించిందేమో!"

వృద్ధ గురుదేవుడి ఉద్రేకం ఇనుమడించింది. ఆవేశంతో, కన్నీళ్ళ ప్రవాహంతో చెప్పుతున్నాడు.

"తాగుబోతుల మధ్య అర్ధనగ్నంగా ఉన్న పాపాత్ము రాలిని ఒక యువతిని చూశాను. అంత అందమైనది విశ్వమంతా గాలించినా కనపడదు. నిడుదపెన్నెరివేణి, నల్లని నేత్రాలూ, లజ్జాహీనమైన చూపులూ, ముత్యాలవంటి దంతపంక్తి చూపెడుతూ మధురహాసమూ,— ఏమి చెప్పేది! 'నేనెంత సిగ్గులేని సుందరాంగినో' అన్నట్టుంది. సిల్కువసనం భుజాలమీద వ్రేలాడుతూ ఉంది. దానిలోనుండి ఆమె

యవ్వనం స్పష్టంగా కనిపిస్తూ ఉంది; చూచేవాళ్ళను ఆకర్షించి మంచెత్తుతూ ఉంది.''

తరవాత కోపావేశంతో చేతు లూపుతూ ముసలి గురువు పట్నంలోని గుర్రపు పందేలూ, తోటపెద్దుల పోట్లాటా, నాట్యశాలా, నాట్యకత్తెల వర్ణనా, నగ్నస్త్రీల చిత్రాల వివరాలూ వివరించి చెప్పాడు. దైవికమైన ఆవేశంతో వృద్ధుడు ఉపన్యాసం చేస్తూఉంటే ఏదో నూతనమైన తంత్రి మ్రోయిస్తున్నట్టుగా ఉంది. శిష్యులైన సన్యాసులు ఆ రసపానంలో నిమగ్నులై ఆనందంలో తేలుతున్నారు. సైతాను కూర్చిన సమస్తవర్ణనా, స్త్రీల భయంకరమైన నగ్నసౌందర్యవర్ణనా అయిన తరవాత గురువు సైతానును కసిదీరా తిట్టాడు. మళ్ళీ తన గదిలో తలుపు బంధించుకున్నాడు.

మర్నాడు ప్రాతఃకాలం బైటికి వచ్చి చూచేసరికి ఆశ్రమంలో శిష్యుడు ఒక్కడైనా లేడు. అందరూ పట్నం దారిపట్టారు.



# అస్తమిస్తూ ఉన్న చంద్రుడు

గదిలో అతనిభార్య రోగశయ్యమీద పడివుంది. తలక్రింద మెత్తని దూది దిండు.

అతడు తన రాతబల్ల దగ్గిర కూచున్నాడు. బల్ల చిన్నది. దానిమీది పరికరాలూ అంతంతగానే ఉన్నాయి. అతని చేతిలో కలం.

బల్లమీద తెల్లకాగితాలు రాతకు సిద్ధంగా ఉన్నాయి. కలం చివరి పాళీతో కాయితంమీద ఓసున్నామాత్రం వేశాడింతవరకు.

కథ ఆరంభించేముందు ఎన్నో కల్పనలు అల్లాడు. కాని ఒకటీ కాగితంమీద రూపం ధరించడంలేదు.

'ఎలా — ఎలా ఆరంభించడం? ఏ మాట ముందు వెయ్యడం?' ఈ ఆలోచనలతోనే సరిపోతూఉంది.

ఇన్‌స్పిరేషన్ రావడంతోనే కథ ఆరంభించేస్తాడు.

మూడు దినాలైంది ఇదే తంతు. గ్రంథారంభదశ. ఇన్‌స్పిరేషన్ దేవత అనుగ్రహం కలగడంలేదు. అచ్చే, ఏమాత్రమూ ప్రసన్నం కాకుండా ఉంది.

కోపం, దుఃఖం కలిసి జుత్తుపీక్కుందామా అనిపిస్తూ ఉంది.

హృద్రోగంతో, అజీర్ణంతో, వాతజ్వరంతో అతడిభార్య మంచంపట్టి రెండుమాసాలైంది.

నేటికి సరిగ్గా రెండునెలలనుండి లేచికూచోలేదు.

అతడు, ఆమెభర్త బళ్ళో మేస్టరు. పిల్లలకి పాఠాలు చెపుతాడు. బడి ఇంటికి రెండుమైళ్ళదూరం. ఇంతదూరమూ కాళ్ళీడ్చుకుంటూ వెడతాడు.

ప్రతిరోజూ ఉదయానే వెళ్ళాలి. సాయంకాలం తిరిగి వచ్చేక భార్య రోగశయ్యకు దగ్గరగా కూర్చుంటాడు.

అర్థరాత్రి వరకూ నిరీక్షణ, ఇన్‌స్పిరేషన్ దేవత కలానికి పని కల్పిందేమో అని.

తలలో ఏదో చెడిపోయినట్టుంది. మితిమీరిన పరిశ్రమా విచారం - ఈ కారణాల వల్ల తల పనిచెయ్యడం లేదు.

ఇవాళకి మూడు దినాలైంది. ఒక పంక్తి కాదుకదా, ఒక అక్షరమైనా కాయితంమీదపడలేదు. ఎంత దౌర్భాగ్యం! బాధగా కలం ఒక్కొదులుపు దులుపుతాడు. సిరా ముద్దగా పడుతుంది కాయితం మీద. కాయితం చెడుతుంది. అది తీసేసి మరో కాయితం. మళ్ళీ నిమీలిత నేత్రాలు, పరధ్యానం, కల్పనాదేవి తపస్సూను.

ఆమె కిటికీ కటకటాల్లోంచి ఆకాశం చూస్తూ ఉంది. మెల్ల మెల్లగా సాయం సంధ్య ఆక్రమిస్తూ ఉంది.

ఓ బరువైన నిట్టూర్పు వదిలి ఆమె అంది: 'ఏమండీ, చీకటి కనిపించడం లేదూ?'

అతడి పనిలో విఘ్నం కలిగిద్దామని అలా అనలేదామె. భార్యమాటలు వినిపించుకోలేదు భర్త. ఒక్కక్షణం పోయాక చూశాడు. నిజంగానే గదిలో చీకటి ముంచుకొస్తూ ఉంది.

వెలుతురు లేకపోతే రాతమాత్రం సాగుతుంది గనకనా!
చేసేది లేక కలం క్రింద పెట్టేశాడు. దీపం స్విచ్ కోసం చెయ్యి చాచాడు.

కుప్పలు కుప్పలుగా ఉన్న కాయితాల్లో స్విచ్ కప్పడి పోయింది.

స్విచ్ వెయ్యడం తోనే దీపం వెలిగింది. గది వెలుతురుతో నిండింది.

కిటికీ తెరగుడ్డమీద దృష్టినిల్పి అతడు మళ్ళీ ధ్యానంలో పడ్డాడు.

కలంతీసి పట్టుకున్నాడు. మళ్ళీ క్రిందపెట్టేశాడు. లేచి కిటికీదగ్గిరికి వెళ్ళాడు. కిటికీ తెరగుడ్డ సర్ది సరిచేశాడు. తిరిగి వచ్చి రాతబల్లదగ్గిర కూచున్నాడో లేదో ఆమె అంది:

"కొంచెం టీ చేసిపెడతారూ?"

అతడు మాటాడకుండా లేచాడు. కొంచెం సేపటిలో టీ తయారుచేసి తెచ్చాడు. భార్య పక్కదగ్గిరికివెళ్ళి నిలబడ్డాడు. దూరంనుండే టీకప్పు ఆమె ముఖందగ్గిర అందించాడు.

ఆమె పుచ్చుకుందికి ఏమాత్రమూ ప్రయత్నించినట్టులేదు. రెప్పవెయ్యకుండా భర్తమొహంచూస్తూ ఉంది. చివరికి అంది:

"ఏమయిందేమిటి మీకు, చెప్పండి."

"ఏదీ, ఏమీలేదు."

"అయితే, మాటన్నా ఆడకుండా ఇంత ఇదిగా ఉంటున్నారెంచేత చెప్పండి!"

"మాట్లాడడాని కేముందిగనక, — ఇదిగో టీ. చల్లారి పోతోంది మరి. తీసుకో."

కప్పు అందుకునే ప్రయత్నమే ఆమెలో ఏమీ కనిపించడం లేదు. మళ్ళీఅంది :

"చూడండీ, మీసంగతి చూస్తే, ఈమాత్రంకూడా చేసి పెట్టడానికి మీకు ఇష్టం లేనట్టు కనిపిస్తుంది. మహాకష్టంమీద చేసిపెట్టి టీ కప్పు నా మొహంమీద తెచ్చిపెడుతున్నారు."

"అబ్బే, అదేమన్నమాట, సంతోషంగానే తయారు చేశాను."

"నిజం! నిజమే చెపుతున్నారూ! నేను రోగంతో పడి ఉన్నాను నిజమే, కాని నాదృష్టిమాత్రం తగ్గిపోలేదు సుమండీ."

కొంచెం ఆగి మళ్లీఅంది: "నాదృష్టిఏమాత్రం తగ్గిపోలేదు. స్పష్టంగా చూడగలుగు తున్నాను. అంతా తెలుస్తూనే ఉంది నాకు. పై నటనతో నన్ను మోస పుచ్చాలని చూస్తున్నారు మీరు."

భార్య మాటలవల్ల మతిపోయి నట్లయింది అతడికి. మంచం పక్క చిన్నబల్లమీద టీ కప్పు మెల్లగా పెట్టాడు. రాత బల్ల దగ్గిర కూచొని మళ్ళీరాతకు ఆలోచనలో పడ్డాడు.

తెల్లకాగితం దిక్కు చూస్తూ ఆలోచిస్తున్నాడు.—

'ఊఁ — కథానాయకుడు కచేరీలో గుమాస్తా అయితేనో- బాగానే ఉంటుంది.'

ఆలోచనలో కెరటాలు లేస్తున్నాయి.

ఆమె నెమ్మదిగా అంటున్నది.

"మీరు చాలా మారిపోయారు. మునుపటిలా లేనేలేరు. నన్నొక బరువులా భావిస్తున్నారిపుడు. దీనికోసం నన్నేదో ఓదార్చాలని చూస్తారు. నేనది కోరడంలేదు."

కొంచెం ఆగి మళ్ళీ అంది.

"సుఖంగా గడపిన మనపాత దినాలు కొంచెం జ్ఞాపకం చేసుకోండి. నన్నెంత ప్రేమించేవారో మీరు! నా కాలికి జోడు కూడా మీరే తొడిగేవారు."

మళ్ళీ అంది.

"అవాళ-నాకు సరిగా జ్ఞాపకం వస్తూఉంది- అవాళ మనం ఇద్దరం మైదానం మీద తిరుగుతూ ఉన్నాం. మైదానం బురదగా ఉంది. నాజోడు బురదలో తగులుకుంది. నేనొక రాతి మీద కూచున్నాను. మీరు బురదలోంచి జోడుతీసి నాకాళ్ళకు తొడిగారు."

భార్య మాటల వల్ల అతడి హృదయంలో గద్గదిక ఏర్పడింది. డాక్టరు చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి.

'ఉద్వేగం ఆమెలో ఏమాత్రం రానీయకూడదు.'

ఓదారుస్తూ ఆమెతో అన్నాడు. "అవును నాకు బాగా జ్ఞాపకం ఉంది. కాని, ఇవన్నీ యిపుడెందుకు అలోచిస్తున్నావు చెప్పూ!"

కొంచెం ఆగి అన్నాడు.

"మునుపటి కంటె ప్రేమ తక్కువ చేస్తున్నానా! పిచ్చి

దానా! ఆమాటకు వస్తే అప్పటికంటె అధికంగా ప్రేమిస్తు న్నానంటే నమ్ము. నీపని చేసి పెట్టడమంటే నాకెంతో ఆనందంగా ఉంటుంది. నువ్వు ఎలా వేగం కోలుకొంటావో అనే నా కోరికంతాను.”

కొంచెం ఆగి మళ్ళీ అన్నాడు:

“ఈ అనవసరమైన ఆలోచన అంతా ఎందుకు చేస్తావో తెలీదు. నిన్నెపుడు అన్యథా భావించడం లేదు నేను. ముం దెలా ప్రేమించేవాణ్ణో, ఇపుడూ అలాగే ప్రేమిస్తున్నాను. కథకోసం ఆలోచిస్తున్నాను. అంచేత పరధ్యానంగా ఉన్నాను. ఇంతమాత్రానికే నీమీద నాకు వ్యతిరేకభావం కలిగిందని అనుకోవద్దు. ఎప్పటికీ అలా అనుకోకు. చూడూ, నువ్విలా ఆలోచనలో పడకూడదు. అవన్నీ అలా ఉండనీ. టీ త్రాగేయి.”

మళ్ళీ ఆలోచనలో పడ్డాడు; కథకోసం.

‘కచేరీ గుమాస్తా లంచం తిని, దొరికిపోయి చిక్కుల్లో పడతాడు. తరవాత ఓ డబ్బున్న పెద్దమనిషి...ఊహూఁ— ఎలా అయితే కథలా వుంటుంది?’

ఆమె నెమ్మదిగా టీ త్రాగడం మొదలు పెట్టింది. మధ్య మధ్య ఎడమచేయి గుండెలమీదా పొట్టమీదా రాస్తూ ఉంది:

“ఇక్కడ బాధగా ఉంది. మీరేమంటారు? ఇది క్షయ రోగమే అంటారా?”

“తెలీదు.”

"మీరు తెలుసుకోడానికి కూడా ప్రయత్నం చెయ్యారు కదా!"

కొంచేపు మాటాడకండా ఉండి మళ్ళీ అంది:

"ఆ డ్రాయర్లో క్షయరోగం మీద ఓపుస్తకం ఉంది. ఏదీ, అది యిలా యివ్వండి, చూస్తాను, నాలక్షణాలు క్షయ లక్షణాలు అవునో కానోను. ఇవ్వండి. పుస్తకం నాచ్చేతికి అందించండి."

డ్రాయరు దిక్కు చెయ్యి చాచింది.

అతడు ఆమె దిక్కు చూశాడు. కలం క్రింద పెట్టేశాడు. పుస్తకం ఆమె చేతికి అందిస్తూ అన్నాడు:

"చదువు. చదివి వినిపించిందికి నాకు వేళలేదు. కథ ప్లాటు తెమలకుండా ఉంది."

"అవును, నాకు తెలీకపోవడంలేదు. నాకోసం చిన్నపని కూడా చేసిపెట్టడం మీకు ఇష్టంలేదు."

దానికి ఆతడేమీఅనలేదు. తలలో కథ పల్లీలు కొడుతూఉంది.

'ప్లాటు ఇంకోలాగ ఐతేనో—' 'ఒకాయన కాలవ త్రవ్వించాలని చూస్తాడు ఉహూం, ఒకాయన అగ్ని ప్రమాదాలు రాకండా ఓసంస్థ స్థాపించాలని చూస్తాడు. అబ్బే—పోలీసు వాళ్ళ సంఖ్య పెంచితే! వీటిల్లో ఏది పాఠకుల్ని ఆకర్షిస్తుంది!'

ఆమె పుస్తకం మొదటి పుటలు తిరగ వేస్తూఉంది. కాని, ఓ అక్షరం కూడా చదవడం లేదు. పరధ్యానంగా ఏదోఆలోచిస్తూ ఉంది. నెమ్మదిగా అంది.

"మనం ఇద్దరమూ కలిసి ఎన్నోసార్లు తిరగడానికి వెళ్ళే వాళ్ళం. జ్ఞాపకం ఉందా! మీరూ, నేనూ..."

కొంచెం ఆగి మళ్ళీ అంది.

"చలి కాలం వెళిపోతూ ఉంది. 'మాపెల్' చెట్టు చిగుళ్ళు సిందూరంలా కనిపిస్తున్నాయి. చెట్టు చెట్టంతా మంటలు పూస్తున్నట్టుంది. మనం ఇద్దరం దానిక్రింద కూచున్నాం. మనం ఎన్నో ఆటలు ఆడుకున్నా మక్కడ. రాలిన ఆకుల మీద ఎన్ని ఉత్తరాలు రాశాం! మీరూ, నేనూ. మీకు జ్ఞాపకం ఉందా?"

మళ్ళీ కొంచెం సేపు ఆగి తిరిగీ అంది.

"గుర్రం బండీ మీద, దగ్గిరసాకూచోని పార్కులో తిరగడానికి వెళ్ళేవాళ్ళం. గుర్రం బగ్గీమీద తిరగడమంటే నాకు ఎంతో సరదా"

కొంచెం ఆగి మళ్ళీ అంది.

"ఉయ్యాల ఊగుతున్నట్టుగా ఉంటుంది. దేవుడి దయ, మళ్ళీ మనం ఎపుడు గుర్రం బగ్గీమీద వెళతామో! మీరు, నేనూ ఇద్దరం కలిసి."

అతడు మాటాడలేదు. ఈసారి ఆమె గట్టిగా అంది.

"వింటున్నారా! నామాటలు చెవుల్లోదూరడమే లేదను కుంటాను. చెప్పాలి. మళ్ళీ ఎప్పుడు మనం గుర్రంబండీ మీద పార్కులోకి తిరగడానికి వెళతామోను!"

అతడు ఆమెదిక్కు తిరిగి చూశాడు. చికాకుపడుతూ

ఉన్నట్టు కళ్ళూ, మొహం చెపుతూనే ఉన్నాయి. కాని అవేవీ వ్యక్తంకాకుండా నెమ్మది గొంతుకతో అన్నాడు :

"నువ్వు బాగయిక వెళదాం."

"ఏం, నేను బాగయ్యేవరకూ ఎందుకూ ఆగడం ?"

కొంచెంఆగి మళ్ళీఅంది :

"ఎపుడు బాగవుతానో ఏమో !"

మళ్ళీ అంది :

"ఆలస్యంచేస్తే, ఏమో, అసలు మీతో కలిసి తిరగడమే పడదేమో ! నాది క్షయరోగమే అయిఉంటే, ఎపుడో హాటాత్తుగా కళ్ళుమూసేస్తాను. నన్నెవళ్ళు బ్రతికిస్తారు మరి !"

అతడికి భయంకలిగింది. ఆలోచనలవల్ల వ్యాధిముదురుతుంది గాని తగ్గదు. ఇలాంటి ఆలోచనలు కూడదని డాక్టరు గట్టిగా చెప్పాడు. రోగానికి భావాలే కారణ మనిపిస్తూ ఉంది. కూడదు. ఇలాంటిభావాలు ఆమెలో రేగనియ్యకూడదు. ఇవి రాకుండా ప్రయత్నం చెయ్యాలి. లేకపోతే ప్రమాదంతప్పదు.

"ఈమాటలన్నీ ఎందుకుచెప్పూ, అనవసరప్రసంగంకాని. కొంచెం నిద్రపో. ఎప్పుడూ ఇలా చెడ్డఆలోచనలుచేస్తూఉంటే మరి వేగం ఎలాలేస్తావు ?"

ఆగి మళ్ళీ అన్నాడు :

"ఇదంతా దుశ్చింత. ఎప్పుడూ తలంపులోనికి రానియ్యకుండా మరిచిపోవాలి. అలాఅయితేనే వేగం బాగ్గా లేస్తావు. మనం మళ్ళీ పూర్వంలాగే గుర్రంబగ్గీమీద తిరగడానికి వెళతాం."

భర్తమాటలు మనస్సావింది.

కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచింది. తరవాత అంది:

"మీరు నాపక్కమీద పడుకోవాలి నాకు కోరికగా ఉంది. మీరిపుడు దూరదూరంగా ఉంటున్నారు. నాదగ్గిర ఉండకుండా మీరు తొలిగిపోతూ ఉన్నారు. నాదగ్గిరగా రావడానికే ఇష్టపడడంలేదు. చూడండీ, ఇలావచ్చి నాపక్క మీద కొంచెం కూచోండి."

"కాని, చూడూ, నేనిపుడు రాస్తున్నానుకదూ! నువ్వు చూస్తునే ఉన్నావుకదా!"

"చూస్తున్నాను. కాని, నాదగ్గిర కూచొని రెండుమాట లాడితే నేను వింటాను. కొంచెంశాంతి కలుగుతుంది. ఇదీ మీకుయిష్టంలేదా?"

కొంచెంఆగి మళ్ళీఅంది:

"పార్కులో తిరగడానికి వెళ్ళేటప్పుడు మనం అనుకునే మాటలూ, అవీ కొంచెం వినిపించండీ. ఇవాళ వినాలని కోరికగా ఉంది."

అతడులేచి ఆమెమంచం దగ్గిరికి వచ్చాడు. కాని కూచోలేదు.

ఈసారి కొంచెం కఠినంగా అన్నాడు.

"ఎల్లప్పుడూ ఆపాతమాటలే ఆలోచించడం మంచిదా! ముందుసంగతి చూచుకోవాలా వొద్దా!"

మళ్ళీ అన్నాడు:

"మంచి చిక్కే వచ్చి పడింది మొత్తానికి! అప్పటినుండీ అదే వాగుతున్నావామె. వెయ్యిసార్లు చెప్పాను, ఇలాంటి ఆలోచనలు వొద్దని. దీనివల్ల రోగం ముదురుతుంది. అయితే మాట వినేవాళ్ళెవరు? చెప్పిమాత్రం ఏం ప్రయోజనం?"

ఇలా అనేసి తిరిగి రాతబల్లదగ్గిరికి వెళ్ళిపోయాడు. కథా రచనకోసం మళ్ళీ గ్రంథారంభదశ లోపడ్డాడు.

'అయితే కచేరీగుమస్తా ఎందుకు లంచంపుచ్చుకున్నట్టు? ప్రజాక్షేమంకోసం దీనికి కారణం చెప్పాలికదా!'

'తరవాత? ... తరవాత? ... మరి?' అబ్బే, కలం సాగడంలేదు. భార్య మరి మాటాడడం లేదుకద? మరి కథ నడవదేం?

భార్యమొహందిక్కు కళ్ళెత్తిచూశాడు. ఆమె ఇంటి వాసాలదిక్కుచూస్తూ కల్పనారాజ్యంలో విహరిస్తూఉంది. పెదవులమీద కనపడీకనపడని చిరునవ్వు రేఖాపాత మవుతూ ఉంది.

ఆమె కళ్ళఎదట బహుశా ఏదో ఒక మనోహరమైన దృశ్యం ద్యోతకమవుతూ ఉన్నట్టుంది.

కొంతసేపు గడిచింది.

నవ్వుమొహంతోఅంది నెమ్మదిగా:

'ఈమాత్రమైనా నాచిట్టిబాబును తిసాయిసి చూశాను. నన్ను పిలుస్తున్నాడు. 'అమ్మా, నువ్వు వెళిపోరా.' అంటు

న్నాడు. 'నేను ఒక్కణ్ణే మరి ఉండలేను. నాకు చాలా కష్టంగాఉంది. నువ్వు వేగం వెళిపోరా.' అంటున్నాడు."

చెపుతూ ఉండగా ఆమెకళ్ళల్లోనుండి అశ్రుబిందువులు రెండు మెల్లగా జారిపడ్డాయి. ముని పెదవులమీద కృశించిన చిరునవ్వూ, కనుకొలకుల్లో కన్నీళ్ళూ. అపూర్వంగా ఉందాదృశ్యం.

అతడు స్పష్టంగా విన్నా డామాటలు. టపీమని లేచాడు. వెళ్ళి మంచందగ్గిర నిలబడ్డాడు.

"ఏమి టంటున్నావు?"

"మన తిసాయి. నా తిసాయి నన్నుపిలుస్తున్నాడు. ఓ, వాడిముఖం ఎఱ్ఱగా ఎంత అందంగా ఉందని! మా నాన్న కళ్ళు నీలాలులా ఉన్నాయి. నన్ను పిలుస్తున్నాడు. తిశాయి వాళ్ళఅమ్మను పిలుస్తున్నాడు."

అతడి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. కన్నీళ్ళు కనపడనివ్వకుండా మొహంత్రిప్పుకొన్నాడు. అతికష్టంమీద తన్నుతాను సుమాళించుకుంటూ, గద్గదికపోతూఉన్న గొంతుకతో అన్నాడు:

"చూడూ, అబ్బే, అదేమిటలాగ! మనతో రుణానుబంధం తీరిపోయి వెళిపోయిన వాడికోసం విచారిస్తూ' శరీరం పాడు చేసుకుంటారా చెప్పూ! నువ్వు ఆరోగ్యం పొందాలి. బాగై లేవాలి."

ఆమె ఈ మాటలు విన్నదో లేదో తెలీదు. మళ్ళీ అదే ప్రకారం పరధ్యానంగా అంది:

"వాడిసమాధిమీద దేవదూత రాతివిగ్రహం స్థాపిస్తాను.

దేవదూత విగ్రహం రాతిది కట్టించడానికి ఎంతఅవుతుందో చెప్పండీ ! ”

ప్రశ్నార్థకంగా భర్తముఖం చూసింది.

అతడు గద్గదకంఠతో ఆన్నాడు :

“ ఈమాటలన్నీ ఇపుడెందుకుచెప్పూ. నువ్వు ముందు బాగయ్యాక అవన్నీ ఆలోచించవచ్చు. నీకెలా, ఏది యిష్టమైతే అది చేద్దాం. ఇపుడు కొంచెం నిద్రపోయిందికి ప్రయత్నించు. నామాట వినవూ ! కొంచెం నిద్రపో. ఈరాత్రి కథ పూర్తికావాలి. నిద్ర నీకు చాలా అవసరం. నా రాణివి కదూ. నిద్రపోయిందికి ప్రయత్నించు. ఏదీ, నెమ్మదిగా పడుకుంటే నిద్రపట్టేస్తుంది.

ఆమె వినిపించుకున్నట్టులేదు. అంది :

“ నేను బాగై లేవడంతోనే వాడికో మంచి సమాధి స్తంభం కట్టిస్తాను. బలపపురాతితో కట్టిస్తాను. ఇంకా ఇంకా ఆ సమాధి స్తంభంచుట్టూ పూలచెట్లతో నింపేస్తాను. రకరకాల పూలమొక్కలు వేస్తాను. శుభ్రమైన చంద్రకాంతిలో సమాధి స్తంభం ఎంచక్కా కనిపిస్తుంది. ”

కొంచెం ఆగి మళ్ళీ అంది :

“ మరి, ఇవాళ తారీకెంతచెప్పండీ, ఊఁ, జ్ఞాపకంవస్తూంది. ఇవాళ సెప్టెంబరు 21 కదూ, అవును, ఇవాళ ఇరవై ఒకటే. ”

కొంచెంసేపు ఊరుకుంది. మళ్ళీఅంది :

“ ఇంకావెన్నెల ఉంది. ఏదీ, నామాట వినరూ ! దీపం

ఆరిపెయ్యండి. కిటికీనుండి తెరగుడ్డ తీసెయ్యండి. వెన్నెల గదిలోకి బాగా రానియ్యండి, చంద్రుణ్ణి చూడాలని నాకెంతో ఇదిగాఉంది ఇవాళ."

మళ్ళీ కొంచెం ఆగి అంది:

"చందమామ — చందమామ, నాతిసాయికి చందమామ అంటే ఎంతోసరదా. చందమామకంటె మంచివస్తువ మరేముంది గనక! మా తిశాయికి చందమామ ఉంటే మరేమీ అక్కరలేదు.

అతడు నిరుపాయుడుగా నిలబడ్డాడు. ఇవాళ మరి కథ పూర్తయేమార్గం కనపడ్డంలేదు. కాని, కథపూర్తి చెయ్యకపోతే వచ్చేవారం భత్యంగడిచే మార్గంలేదు. స్కూల్లో మాస్టరు గిరీ, పత్రికలకు కథలు రాయడమే అతడి జీవన భృతికి ఆధారం. కష్టంమీద కూడబెట్టిన పదీ, అయిదూ — అన్నీ భార్య అనారోగ్యంవల్ల మంచినీళ్ళలా ఖర్చయిపోయాయి.

అతడన్నాడు:

"ఇదిగో, కథపూర్తి చెయ్యకపోతే మనం ఉపవాసం చెయ్యవలసి వస్తుంది."

"ఏమైనాసరే, కొంచెంసేపైనా దీపం ఆర్పెయ్యండి చంద్రకిరణాలంటె నాప్రాణం లేచివస్తూఉంది. తిసాయి చంద్రుడంటే చాలాఇష్టం."

అతడు మరి చిరాకుపడలేదు. గదిలోదీపం ఆర్పేశాడ

కిటికీ తెరగుడ్డకూడ తీసేశాడు. కిటికీ బారుగా తెరవడంతోటే చంద్రకిరణాలు వచ్చి గదిలో ఒలకపోసినట్లు పడ్డాయి.

అతడు మడతకుర్చీలో చేరబడ్డాడు.

ఎంతోసేపు గడిచిపోయింది.

అతడికి చలివెయ్యడం ప్రారంభించింది.

చల్లగాలి కస్సుమంటూ వీస్తూఉంది.

చలికాలం వెళిపోతూఉంది.

అతడు లేచి కిటికీదగ్గిరికి వచ్చాడు. కిటికీ మూసివేశాడు. తెరగుడ్డ యథాప్రకారంగా సర్దాడు. దీపం వెలిగించాడు. చప్పుడు కాకుండా అడుగులు వేస్తూ భార్య మంచం దగ్గిరికి వచ్చాడు. ఆమె స్పృహ లేకుండా పడుకొని ఉంది. ముఖం నవ్వుతున్నట్లుగానే ఉంది. సంతృప్తిముద్ర స్పష్టంగా కనిపిస్తూ ఉంది. చిత్రం!

రెప్పవెయ్యకుండా ఆమెముఖాన్ని చూస్తున్నాడతడు — ఆమెభర్త.

ఇందాకటి మైదానంమాట తనభార్య భావిస్తూ ఉందనిపించింది అతగాడికి. అవాళటిసంగతి — అవాళ, తనభార్య ఒకరాతిమీద కూచొని కాలు కొంచెం ఎత్తుగా పెట్టింది. అతడు ఆమె పాదానికి జోడు తొడిగాడు. అదే — ఆదృశ్యమే ఇపుడామె చూస్తూ ఉందనిపించింది. అవాళ, గుర్రబగ్గీ

మీాద తిరిగి వచ్చిన మాటకూడ ఆమె మరచిపోలేదు. అలాగే, ఎంతోసేపు నిలబడి ఆమె మొహం పరికిస్తూ ఇంకా అను కున్నాడు — బహుశా ఆమె శూన్యంలో చూస్తూ వాళ్ళ తిసాయికోసం సమాధి స్తంభం చిత్రిస్తూ ఉందేమో!

ఒక నిట్టూర్పు విడిచాడు. పక్క మీాది దూదిబొంత ఆమె భుజాల వరకూ కప్పేశాడు, ప్రేమగా.

అస్తమిస్తూఉన్న చంద్రుడు మేడలచాటుకు వెళ్ళిపోయాడు.

---

# బాకులు

ఎవళ్ళెలాంటివాళ్ళో తెలుసుకోవాలని ఉందా, ఐతే ఆది వారం బులేవార్ కిపద. సాయంకాలం ఆరుగంటలకే ఆ వారం పాస్కా కకుష్కిన్ తిరగడానికి బయల్దేరి పోయాడు. ఓం ప్రథమంలోనే ఓ బీరుబుడ్డి గొంతుకలో పోసుకున్నాడు. అది ఉంటేనేకాని ఉషారూ, ధీమా కలగదు.

తరవాత ఓముసలమ్మ దుకాణంలో పుష్పాలగుత్తులు కొన్నాడు. అక్కడినుండి పెద్దవీధినిబడి కాలినడకని బైల్దే రాడు. దార్లో ఓ ఎరుకలపడుచు ఎదురుపడింది.

"బాబుగారు, అయినింటివారు. ఏదీ చెయ్యిచూస్తాను. ఎరుక చెప్తాను. ఏ పెట్టకోసం గుండెల్లో కొట్టుకొంటూఉందో, మనస్సులో ఏమేముందో, అన్నీ చెప్పేస్తాను. దాపరికం ఉంచను. ఒక్క పెన్నీ, ఒక్క పెన్నీమాత్రం కట్నం ఇప్పించండి. నా మాటలు అబద్ధంకావు. గడ్డిపోచంత వారా ఉండదు. ఎరుక వినకుండా పోతిరా, తరవాత విచారిస్తారు."

పాస్కా ఓక్షణం ఏమాలోచించాడో, అన్నాడు: "చూడూ, పిల్లా, చెయ్యిచూసి అదృష్టం చెప్పడమంత కల్లుముచ్చుతనం మరోటిలేదు. పోనీ, ఇదిగో నీకట్నం తీసుకో, అయినా, ఏదీ నాఅదృష్టంలో ఏముందో చెప్పూ చూద్దాం."

రంగు రంగుల సంచిలో పెన్నీ పడవేసుకొని, నల్లటిపళ్ళు పైకిచూపిస్తూ నవ్వింది ఎరుకలపడుచు.

"ఓ పిట్ట కనిపిస్తుంది. బలేపిల్ల. దానివల్ల నీగుండెల్లో మంట రాజుకుంటుంది. ఓ ముసలాడు నీదారికి అడ్డుపడతాడు. అయితే నువ్వు భయపడకు. కత్తులు, కేవలం కత్తులు చూసి భయపడాలి. ఏమంటావా, కత్తులే నీకు విచారకారణం అవుతాయి. ప్రియజనాన్ని చూసి భయపడకు. శత్రువులే భయకారణం. ఇంకా చెప్తా నుండు. ఓ పచ్చనిపిట్ట నీ జీవితంలో ఆనందం కలిగిస్తుంది. తిన్ననిదారిని నడచిపో, సుఖం కలుగుతుంది. జయం కలుగుతుంది."

విజ్ఞానమంతా తన వేళ్ళమీాదనే ఉన్నట్టు నటిస్తూ వెళ్లిపోయింది ఎరుకలపడుచు.

సగంకళ్ళతో చూస్తూ పాస్కా ముందుకుబయల్దేరాడు.

దారికడాకూ ఉషారైన ప్రతివస్తువునూ చవిచూస్తూనే ఉన్నాడు. మొదట ఓ బరువుతూచే యంత్రంమీాద వెళ్ళి నిలబడ్డాడు. తన బరువు 128 పౌండ్లు. తరవాత పాదంతో నొక్కి తనకాళ్ళలో ఎంతశక్తి ఉన్నదీ పరీక్షించాడు. మీాటరుముల్లువెళ్ళి ఓ ఇరవైఏళ్ళ కుర్రాడి కాలిశక్తిని తెలియజేసే గీతమీాద నిలిచింది.

తరవాత ఎలక్ట్రిక్ కరెంటుదగ్గిర తననరాలశక్తిని పరీక్షించాడు. పిడికిలితో హేండిలు గట్టిగా పట్టుకున్నాడు. తన మాంసగ్రంథులమధ్య జువ్వుమన్నట్టయింది. నరాలలోనుండి గ్యాస్ ప్రవహించినట్లయింది. హేండిలుకు చెయ్యి తగులొక్క

న్నట్టయింది. ఏమయినా తన నరాలు శక్తివంతమైనవని మాత్రం రుజువైంది.

తుదకు ఓ చెట్టుకు వ్రేలాడుదీసిన చిత్రందిక్కు వీపు చేసి కుర్చీమీద కూర్చున్నాడు. 'కామెన్నీ' వంతెనమీదినుండి మాస్కో క్రోమలిడ్ దృశ్యం చిత్రింపబడి ఉం దా చిత్రంలో. కాలిమీద కాలువేసుకొని కూచున్నాడు కుర్చీలో. మొహం సీరియస్‌గా పెట్టాడు. అలాకూర్చొని ఫోటోతీయించుకున్నాడు. పది నిమిషాల్లో ఫోటోగ్రాఫరు తడివడిగా ఉన్న కార్డుముక్క చేతికిచ్చాడు. పాస్కా ఫోటోలో తన మొహం మహాపరీక్షగా చూశాడు. అతడి సంతోషానికి మేరలేదు. ముడతలుపడ్డ టోపీ, పరిచితమైన ముక్కూ, కాళ్ళవరకూ వ్రేలాడుతూ, మెడదగ్గిర బొత్తాములు లేని కమీజూ, వేస్టుకోటూ – అన్నీ మూడుమూర్తులా పిసరంత వారా లేకండా ఉన్నాయి. తాను ఇంత బలేగా కనిపిస్తూ ఉన్నాడన్న మాట, అతడి ఊహాకే అతీతంగా ఉంది. నిజంగా పరమానందగా ఉంది.

'ఒరవాలేదు, బాగానే ఉంది' అంటూ తడిగాఉన్న ఫోటో ఓ కవర్లో పట్టుకొని సరస్సుదిక్కు పడవల రేవుకి వెళ్ళాడు. ఇక్కడ రంగేళీతనం సప్తమంలో ఉంటుంది. యవ్వనంలో ఉన్న అమ్మాయిలతో బోట్లుపైరు. అయితే ఏమాత్రమూ ఖాళీ లేనంత రద్దీ. చేసేదిలేక వెళ్ళిపోవచ్చాడు ఓ చైనా కుటీరం దగ్గిరికి. ఎదట జనసమ్మర్దంగా ఉంది. లోపల టంగ్, టంగ్' చప్పుడూ పెద్ద రొదని నవ్వూను.

'ఏమిటి సంగతి' మోచేతుల్లో జనాన్ని ఒత్తిగించుకుంటూ లోపల దూరి అడిగాడు ఒక ఎర్ర సైనికుణ్ణి.

"రింగులు, బలే గమ్మత్తు, రింగు సరిగా విసరగలిగావా అంటే ఓ ప్రయిజు కొట్టేవన్నమాటే."

ఎగబడి జనం తలల మీంచి బడ్డీలోకి చూశాడు పాస్కా. దీపం వెలుతుర్లో ఆమూలాగ్రం కనిపిస్తూ ఉంది. వెనకాల గోడ గోనెతో కప్పేసి ఉంది. మూడువరసలుగా చిన్న చిన్న కొయ్యలు, ప్రతీకొయ్యకూ ఒక్కొక్క బాకూ ఉన్నాయి.

బాకుల మధ్య అనేక రకాల ప్రయిజులు ఉన్నాయి. క్రింద వరసలో కేకులూ, మిఠాయి పొట్లాలూ ఉన్నాయి. మధ్య వరసలో పాత్రలూ, టోపీలూ, అలారం వాచీ, నీడగా చీకటిగాఉన్నచోట చిన్నబాల్దీలో షిల్లింగువెలగల అనేకం చిల్లర వస్తువులూ క్రోము లెదర్ నీబూట్లూ, ఒక టాలస్టాయి షర్టూ ఒక ఇటాలియన్ హార్మోనియం, ఓ పెద్దగడియారం, ఒక గ్రాను ఫోనూ ఉన్నాయి. ఏ వరసలోని బాకుమీాద రింగు వెయ్య గలిగితే ఆవరసలో ఆబాకు దగ్గరి ప్రయిజు దొరుకుతుంది. అయితే రింగు విసరగానే బాకుకు తగిలి రింగులు స్ప్రింగుల వలె త్రుళ్ళిపోతున్నాయి బైటికి. బలే తమాషాగా ఉంది. మోచేతులతో తోసుకుంటూ పాస్కా మరింత ముందుకు వెళ్ళాడు. బడ్డీ అంచుని వెండి నులోచనాలతో ఓ ముసలాయన కూచొని రింగులకోసం డబ్బులు తీసుకుంటున్నాడు. ఒక షిల్లింగునకు నలభై రింగులు. ఎర్రగా కందిపోయిన మొహంతో

ఒక యువకుడు తన చివరి డజను రింగులు విసురుతున్నాడు. లలాటంమీద చెమటలో ఎదటి జుత్తు అత్తుకపోయింది. మొహంలో ఏదో చేతకాని కోపం. ఒంటిమీద కోటు విడి పోయి వ్రేలాడుతూ ఉంది. లావుపాటి వ్రేళ్ళమీద నుండి జారి వస్తున్నాయి. ఉక్కురింగులు వెళ్ళి బాకులకు తగులు తున్నాయి తుళ్ళిపోయి, క్రింద ఏర్పరచిన సంచిలోకి దొర్లి పోతున్నాయి. కుర్రాడు నల్లబడి పోయాడు. రింగు వచ్చి తగిలేసరికి బాకు టంగ్ మంటూ కంపిస్తుంది; రింగుకు దొరక కుండా తల తప్పించుకుంటుంది. చిత్రం!

"వెధవ బాకులూ వెధవరింగులూనూ" కుర్రాడు అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

"ఒకటిన్నర రూబులు అయిపోయింది, కాని ఓ కేకు ముక్కయినా వచ్చింది కాదు." సిగ్గుతో మొహం వేసు కుంటూ వెళ్ళిపోయా డతడు.

"గత ఆదివారం పది రూబుల్సు పోయాక ఒకాయన ఓ బూట్లజత గెలిచాడు." మూకలోంచి ఓపిల్లాడు అన్నాడు.

"ఏదీ, మనం ఓసారి చూదాం." జనాన్ని తోసుకుంటూ ముందుకు వచ్చాడు పాస్కా. "ఏదీ చూదాం." ముస లాయన కొన్ని రింగులు అందించాడు.

"అచ్చా, క్రిందవరసలో వేయగలిగానా, మిఠాయి పొట్లం దొరుకుతుంది. ఏం?" మాంచి ధురంధరుడిలా అన్నాడు. పాస్కా.

" ఆఁ, తప్పకండా " అన్నాడు ముసలాయన నెమ్మదిగా.

" మీద వరసలో వేశానా అంటే అలారం వాచీ. " ముసలాయన తల ఊపాడు.

" బలే, అయితే పెద్దప్రయిజు కొట్టాలంటే ఈ మొదటి వరసలోని బాకుమీద రింగు వేయాలన్నమాట. అంతేనా ? "

" మొదట కేకు ముక్క సంపాయిద్దూ, తరవాత వాగు దువుగాని " దొమ్మిలోంచి ఎవరో అన్నారు.

ఫోటో కవరు బడ్డీ అంచుని పెట్టి మోచేతులతో రెండు ప్రక్కలా జనాన్ని త్రోసి జాగా చేశాడు. పాస్కాబడ్డీ మీదికి వంగి గురిచూసీ చూడ్డంతోనే చెయ్యి వడకడం, రింగు చేతి వ్రేళ్ళనుండి జారిపోవడం క్రిందికిదొర్లిపోవడం జరిగిపోయింది. పాస్కా ఆపాదమస్తకం చల్లబడి నట్లయింది.

రింగుల దగ్గిర, కుర్చీమీద యవ్వనంలో ఉన్న ఓ అమ్మాయి, అందమైన దుస్తులు వేసుకొని, ఒడిలో రెండు చేతులూ ఉంచుకుని, నిశ్చలంగా ఉంది. ఆమె ఎంత అందంగా ఉందంటే, చూసీ చూడడంతోనే పాస్కా కళ్లు జిగేలు మన్నాయి. అమ్మాయి టపీ మని లేచి క్రిందినుండి రింగు తీసింది; పాస్కా మొహం దిక్కు చూడకుండానే అతడి చేతికి అందించింది. అందిస్తూ కనపడీ కనపడని ఓ చిరునవ్వు పెదవుల చివరినుండి తేలిపోయేటట్టు నవ్వింది. ఆనవ్వే పాస్కా కొంప తీసింది.

"ఏమయిందయ్యో, ప్రయిజు రెండు చేతుల్తో పుచ్చుకో" మూక మూకంతా గోల్లు మన్నారు.

పాస్కాకు తిరిగీ పౌరుషం వచ్చింది. వెంటనే రింగులు విసరడం మొదలు పెట్టాడు. ఇంకా ఎటూ దృష్టిలేదు. 'నను మరచిపోకు' అంటూన్న ఆఅమ్మాయి కళ్ళమీదా, ఓ కమలాల తొనరెండుగా చీల్చినట్టున్న పల్చటి ఆచిన్ని పెదవుల మీదా చూపులు సంలగ్నంగా ఉన్నాయి.

ఒక్క ఊపుని నల్భై రింగులూ విసరడ మయ్యాక, ఆమె ఒక్కొక్కటీ ఏరితీసింది. ఒక్కమాటన్నా అనకుండా అవి బడ్డీమీద వ్రేలాడదీసింది. ఈ సారి కేవలం నవ్వడంతో ఊరుకోలేదు; పాస్కాను ఓసారి చూసింది కూడా; జారిన పిడికెడు జుత్తూ వెనక్కు నవరిస్తూ.

మరోదఫా వెంట వెంటనే మళ్ళీ ఎగిరాయి రింగులు అటూ, ఇటూ ఇష్టం వచ్చినట్టు. జనం పాస్కాను వీపు తట్టి నివారిస్తున్నట్టున్నారు. బాకులు దోమల రొదవలె శబ్దం చేస్తున్నాయి. జుంయ్, జుంయ్ మంటూ వ్రేలు వంచుకొని ముక్కు గోక్కుంటున్నాడు ఏమీ ఎరగనట్టు ముసలాయన.

చేతులారా అంత సొమ్మూ పోగొట్టుకొని చిన్నబోయిన మొహంతో పాస్కా రోడ్డు మీదికి వచ్చేశాడు. జనానికి దూరంగా నిమ్మచెట్ల క్రిందగా గులాబుల ప్రక్కనుండి నెమ్మదిగా నడుస్తున్నాడు. మసక మసక పొగమంచు సరస్సును కప్పుతూ ఉంది. అతడి రెండు చేతుల్లోను ఓ సజీవత్వం అనుభ

వానికి వస్తున్నట్టుగా ఉంది. సినిమాహాలు దీపాలు అగ్ని తోరణంలా సరస్సులో ప్రతిఫలిస్తూ ఉన్నాయి. గిరజాల జుత్తు అమ్మాయిలు జోడీలు జోడీలుగా చెట్టాపట్టాలు పట్టు కొని అతడి ప్రక్కనుండి వెళిపోతున్నారు. జుత్తుల్లో ఆకుపచ్చ నీలి రంగుల దువ్వెనలు. తిరిగి తిరిగి అతణ్ణి చూస్తూ కిలా కిలా నవ్వుతున్నారు. అతడి భుజాన్ని తోసుకు పోతున్నట్టు నటి స్తున్నారు. నిజానికి చూస్తే చిత్రంగా ఉన్నారు. కాని వాళ్ళ దిక్కు కన్నెత్తి చూడనైనా చూడకుండా నడుచుకు పోతు న్నాడు పాస్కా' గుండెల్లో ఏదో విచారం గొంతుకులో చిన్న పాట:

'చెప్పింది ఎరకల్లి చెప్పిందిరా
చెప్పిందిరా చెప్పిందిరా
ఎరకల్లి చెప్పింది చెప్పిందిరా
చెయి చూసి ఎరకల్లి చెప్పిందిరా.'

ఆ నెలంతా ప్రతీ ఆదివారం పాస్కా రింగులబడ్డీ దగ్గిరికి వెళ్ళేవాడు. రింగులు విసరేవాడు. జీతంలో సగం ఎగిరిపోయేది. మనస్సూ, శరీరమూ అనారోగ్యంగా ఉండేది. వేళ హరించుకు పోయేది. సెలవు పెట్టేవాడు కాదు. ప్రతీసారి అమ్మాయి కళ్ళు దించుకొని రింగులు అందించేది. అప్పుడప్పుడు తనలో తాను నవ్వుకున్నట్టు నవ్వేది కూడా. జనం మధ్య పాస్కా కళ్ళతో ఆమెకళ్ళు హటాత్తుగా కలుసుకున్నపుడు, ఆమె

ఆపాదమస్తకం ఎర్రబడి, పల్చటి కమీజులోంచి గుండ్రని స్తనాలు రెండూ ఎర్రటి యాపిల్సులా ద్యోతకమయేవి. ఐతే పాస్కా ఎంత ప్రయత్నించినా ఆమెతో మాటాడిందికి ఓక్షణం కూడా సందు దొరికేది కాదు. ఒకపుడు జనం రద్దీగా ఉన్నారంటే, మరో అపుడు సులోచనాల జోడులోంచి చూస్తూ ఉన్న ముసలాడి సంశయ దృష్టి. వ్రేలు వంచుకొని ముక్కు గోకుకొంటూ 'ఇటు కాలు పెట్టకు' ఈ అమ్మాయి నీకోసం కాదు' అని పాస్కాను గదమాయిస్తూ ఉన్నట్టు చూసేవాడు ముసలాడు.

కాని, ఓనాడుమాత్రం, జనం ఒకరిద్దరున్నారో లేదో దూర దూరంగా. రౌడీ కుర్రాళ్ళను తరిమిందికి ముసలాడు కర్రపట్టుకు బైటికి వెళ్లాడు. అలాంటపుడు కొట్టుకుంటూ ఉన్న గుండెలతో పాస్కా అమ్మాయితో అన్నాడు:

"క్షమించాలి, నీపేరేమిటి ?"

"లి ఉడ్‌మిల్లా" నెమ్మదిగా నెమ్మదిగా చెప్పింది అమ్మాయి. తొందర తొందరగా ఇంకా అంది "నువ్వు నాకు తెలుసు. అవాళ బడ్జ్ అంచుని ఫోటోగ్రాపు వదలేసి వెళిపోయావు. నేను తీసి దాచాను. అదంటే నాకు ప్రాణం; ప్రేమ. ఎంత బావుందని." అంటూ తన గుండెల మధ్యనుండి వ్రేళ్ళతో పూసలపేరు లాకెట్టు తీసింది. అందులో మడిచి ఉంది పాస్కా ఫోటో. మొహం ఎర్రబడింది. కళ్ళు చలిస్తున్నాయి.

"నీపేరోమరి" ?

"పాస్కా, నాతో కార్నియమ్‌కు వస్తావూ? బలే పిల్మ్ ఆడుతున్నారు. 'పదిలక్షల అమ్మాయిలు'— "

"వీల్లేదు, నాన్న వెళ్ళనివ్వడు."

"పారిపోయిరా"

"అమ్మయ్యో, వెళ్ళానా అంటే తిరిగి రానివ్వడు. అమ్మ మరిన్నీ, బజార్లో ఆమె దుకాణం. మా అమ్మా, నాన్నా ఎలాంటి చండశాసనులో నీకు తెలీదు. వింటే హడలెత్తి పోతావు. స్త్రీటన్‌కాయలో మాఇల్లు. వీథిపేరు ప్రసవిర్ని పెరెయూలక్. ఇక్కడికెంతో దూరంలేదు. రెండో నెంబరు బ్లాకులో ఎడమప్రక్క."

"ఊఁ, ఇంకా – లిడుడ్మిల్లా, నారాణీ, –'

"మరేం తెలీదు నాకు. వేగం, వేగం రింగులు విసురు. నాన్న వచ్చేస్తున్నాడు."

రింగు విసరడానికి ముందుగానే వచ్చేశాడు ముసలాడు, చేతికర్రా తనూను, లిడుడ్మిల్లా దిక్కు చురచురా చూస్తూ. పాస్కాకు ఈసారీ ఏమీ ప్రయిజు రాలేదు. మళ్ళీ ఆదివారం వచ్చి చూశాడు. రింగులపాక మూనేసి ఉంది. కేవలం బైట ఒకస్పైనుబోర్డు మాత్రం వ్రేలాడుతూ ఉంది.

"అమెరికా రింగుల ఆట. అదృష్టం పరీక్షించండి" ఓమూల గులాబీరంగు తోకతో ఓపచ్చని చిలకపిట్ట బొమ్మ. చిలక ముక్కుతో ఓరింగు పట్టుకుంది. గాలిచెట్ల ఆకుల్ని పాక చుట్టూ పోగు చేస్తూఉంది. పూల పొదరిళ్ళు మంచుతో మలి

నంగా కనిపిస్తున్నాయి. చుట్టుపక్కల మనిషన్నవాడు లేడు. చలికాలం.

ఎరుకుల పడుచు మాటలు జ్ఞాపకం వచ్చాయి పాస్కాకు. 'ఓముసలాడు నీదారికి అడ్డుపడతాడు. కత్తులే నీకు విచార కారణం — పచ్చనిపిట్ట ఆనందం తెస్తుంది.' ఎరుకుల పడుచు మీాద చెప్పరానంత కోపం వచ్చింది. చిలక పిట్టదిక్కు పిడి కిలి ఎత్తాడు కొడతా నన్నట్టు. అక్కడినుండి జనశూన్యమైన బులేవార్ పక్కనుండి నడుస్తూ వెళిపోయాడు. ఎక్కడికో ఇష్టం వచ్చినదిక్కుకి. మనస్సునిండా ఏదోశూన్యం.

స్త్రీటెన్ కాయవచ్చి ప్రసవిర్నినందు పోల్చుకున్నాడు. ఆకా శం మబ్బుగా ఉంది. ఇంకాసందేహంలేదు, చర్చికి ఎదురు గుండా అదిగో రెండో నెంబరు బ్లాకు. బ్లాకు ఎడమదిక్కు తిరిగాడు. అక్కడ ఎటువెళ్ళాలో తెలీదు. సరిగ్గా అదే సమ యానికి సారంగం మ్రోగింది. పైన కూచుని ఉంది, ఓపచ్చటి చిలకపిట్ట. గుండ్రని కళ్ళతో తనదిక్కే చూస్తూ ఉంది. ఇం తలో మూడో అంతస్థులో ఓకిటికీ తెరవబడింది. కిటికీలోంచి ఓ కోమల హస్తం బైటికి వచ్చింది. పాస్కా పాదాల దగ్గిర ఓ మడతకాయితం వచ్చిపడింది. కిటికీ అద్దాలలో చూశాడు. లిడుడ్మిల్లానూ. సంతోషంగా వెయ్యికళ్ళతో చూశాడు. ఆమె గులాబీరంగు బుగ్గలు అద్దాలకు అంటుకొని ఉన్నాయి. వ్రేళ్ళతో, చేతులతో, బొమ్మలతో ఏదోసైగ చేస్తూ ఉంది. ఆసైగలో అర్థ మేమిటో తెలియడం లేదు. పాస్కాకూడా

సైగ చేస్తున్నాడు, ఆమెను వచ్చెయ్యమంటున్నాడు. "వెధవ తల్లీ తండ్రీని! నువ్వు లేకండా నేను బ్రతకలేను." అంతలో లిడుడ్మిల్లా పక్కని వచ్చినిలబడింది, మరో స్త్రీవ్యక్తి. లావుపాటి శరీరంమీాద టర్కీశాలువు చుట్టుకొని ఆమె పిడికిలి ఎత్తి పాష్కాను బెదరించింది. దభీమని కిటికీ మూసి వేసింది.

తోక ముడుచుకొని ఇంటికి వచ్చేశాడు పాష్కా. దుస్సహమైన బాధతో పదిహేను దినాలు గడిచాయి. రాత్రిళ్ళు ప్రసవిర్ని సందులో తిరిగేవాడు. నడుస్తూ గుడ్డివాడిలా వస్తూ పోతూ ఉన్న వాళ్ళమీాద పడిపోయే వాడు. మనిషి చీకిపోయాడు.

మూడోవారం ఆదివారంనాడు నానవేసిన తేయాకు నీటిలో దుస్తులు ఉలికి బాగు చేసుకున్నాడు. గులాబీరంగు టై సిద్ధం చేశాడు. జోళ్ళకు రంగు తోమాడు. ఉద్దండమైన ఆబోతు పెయ్య కొమ్ములు పట్టుకుందికి బైలుదేరినట్లు చేతు లూపుకొంటూ బైల్దేరాడు. సగం తెరిచిన కిటికీలోంచి లిడుడ్మిల్లా దూరం నుండే చూసి నిశ్చేరపోయినట్లయింది. గుండెల దగ్గిర చేతులు పిడికిలిగా పెట్టుకుంది. పాష్కా తిన్నగా ఇంట్లోకి వచ్చేశాడు. ఆమె తల్లీ తండ్రీ అప్పుడే భోజనం ముగించి టీ త్రాగుతున్నారు.

"నమస్తే, క్షమించాలి బాబయ్యగారూ, నిజం చెప్తున్నాను. లిడుడ్మిల్లా లేకుండా నేను బ్రతకలేను. ఆమెను చూసినప్పటినుండీ నాఅవస్థ ఇలా అయిపోయింది, నాపరిస్థితి.

ఇదిగో ఆరవ తరగతి పనివాణ్ణి; అంతేకాదు, ఓవర్‌టైము కూడా పనిచేసి సంపాదిస్తాను. తాగడం గీగడం నా వొంటా గింటా లేదు. తొలినుండీ పార్టీలో మెంబరుగా ఉన్నాను. ఏ యువతినీ పోషించవలసిన బాధ్యత నాకు లేదు. ఇందులో మాయామర్మం లేదు. అంతా విప్పి చెప్పాను. మీ దయ ఎలా ఉంటే అలా చేయించండి. ”

వికారమైన మొహంతో ముసలాడు చప్పున లేచాడు.

“ నేను నీబాబయ్యనూకాను, మాఆవిడ అమ్మాకాదు, నోరుముయ్యి. ”

పెద్ద బొంగురు గొంతుకతో అతడి భార్య అంది :

“ ఏమిటోయ్, ఈతతంగం ! ఇంటి చుట్టూ తిరగడం సైగలూ, పరాయి కొంపలో దూరడం మా తాతలనాడూ యిలాంటి వ్యవహారం చూడలేదూ, వినలేదు. మీదు మిక్కిలి మాపిల్లకు ఈ ఘటమా పెళ్ళికొడుకు ! ఓయి దేవుడా, ఆరో తరగతి పనివాడు ! నిరుడు మాయిస్‌ని టస్కావీధి ప్లాటు మేనేజరు అమ్మాయికోసం వస్తేనే తిరగగొట్టేశాం. నడూ ముందు ఇంట్లోంచీ అంటూ. మాపిల్లను మేం ఇంట్లో ఉంచేసు కుంటాం. మా కేపని వాడూ అక్కర్లేదు. అందులోనూ పార్టీ పనివాడు. ”

మరింత ఉద్రేకంతో ముసలాడు గర్జించాడు :

“ ఒక్క రింగుల ఆటలోనే ఒకొక్క సీజన్లో వేలకొద్దీ రూబుల్సు గడిస్తాను. ప్రయిజులే నాలుగు వందల రూబుల్సువి

ఉన్నాయి సిద్ధంగా. మదుపుకి నాలుగురాళ్ళు చేతిలో ఉన్న వాడూ, మావ్యాపారం వృద్ధిలోకి తేగలిగినవాడూ అమ్మా యికి వరుడు కావాలి. అంటే ఏమిటో తెలుసా, నువ్వు అవతలికి దయచెయ్యి అన్నమాట."

"అయితే, ఆమెను నాకివ్వరన్నమాటే ?"

కూలి పోయినట్లుగా ప్రశ్నించాడు. పాస్కా.

"ఎంత మాత్రమూ ఆపని జరగదు."

"అయితే, సరే. వ్యాపారంకోసం మదుపే కావాలంటే ఇవాళతోటే మీకూ నాకూ తెగుతెంపులు ఈవిషయంలో. తెలిసిందా? ఈసంగతి మాత్రం మీమనస్సులో పెట్టుకోండి, చెపుతున్నాను. నేను. రుజువు చేసి చూపిస్తాను మీకు. భయంలేదు, లిఉడ్మిల్లా! లొంగిపోకు. నాకోసం ప్రతీక్షించు."

దంపతులను భయపిస్తూ అన్నాడు పాస్కా. ఓపెట్టె మీద చేతులు నులుపుకుంటూ కూచుంది, మాటాడకండా లిఉడ్ మిల్లా.

దవడలు బిగించుకొని వీథిలోకి వచ్చేశాడు పాస్కా. మార్కెట్లోకి వెళ్ళి ఓసూరకత్తి కొన్నాడు. ఇంటికి వెళ్ళి గది తలుపులు మూసుకున్నాడు. చలికాలం వచ్చింది, వెళ్ళి పోయింది. సరస్సులో మంచుకురవడం తగ్గుతోంది. పాస్కా ప్రతీదినం వేళప్రకారం పనిలోకి వెళ్ళేవాడు. మిగిలిన సమయం పైర్లుకొట్టి వ్యర్థపుచ్చలేదు. చలికాలపు సాయంకాలాలు ఇంట్లోనే తలుపులు బిగించుకొని గడిపేవాడు. ఇరుగు పొరుగు

వాళ్ళు వినేవాళ్ళు టంగ్ టంగ్ శబ్దం. 'వీణగాని నేర్చుకోవడం లేదుకదా! ఏమో ఎవరికీ తెలీదు. వసంతం ప్రవేశించింది. మంచు కరిగే దినాలు వచ్చాయి. సూర్యుడి వేడి పెరిగింది. పొలాలు పచ్చగా కనపడుతున్నాయి. చెట్లు చివురిస్తున్నాయి. సరస్సులో పడవలు విడిచి పెడుతున్నారు. ఫోటోగ్రాఫర్లు వెన్నెల రాత్రుళ్ళలో కూడ ఫోటోలు తీస్తున్నారు. బులేవార్‌లో సాయంకాలాల్లో కోలాహలం ఆరంభమైంది. అంతా నిత్యనూతనంగా ఉంది.

ప్రతీ ఆదివారం సరస్సు ప్రక్కనుంచి వచ్చేవాడు పాస్కా, రింగుల పాక తెరచారో లేదో అని. ఉఁ హూఁ, తెరవలేదు. గులాబీరంగు తోకతో ఆకుపచ్చ చిలకపిట్ట, నోట్లో రింగు పట్టుకొని అలాగే కూచొని ఉంది, ఎండలో పగిలిన సైను బోర్డు మీద. కొత్త కొత్త ఆకులు దానిమీద రాల్తునే ఉన్నాయి. పాస్కా కూడా చాలా చిక్కిపోయినట్టు కనిపిస్తున్నాడు. ఐనా సాహసిలా ఉన్నాడు. ఓనాడు మాంచి కలకలలాడుతూ ఉన్న సాయకాలం రింగుల పాక తెరచి ఉండడం కనిపించింది. ఎదట అనేకమంది మూకగా ఉన్నారు. లోపల ఎప్పటిలాగే దీపం వెలుగుతూఉంది. ఎప్పటిలాగే బాకులుమీద రింగులు ఝుంకారం చేస్తూ నవ్వుతున్నాయి.

భుజాలతో జనాన్ని తోసుకుంటూ పాస్కా లోపల ప్రవేశించాడు. నెమ్మదిగా తల వంచుకొని బడ్డీ దగ్గరసా వెళ్ళాడు. బుగ్గలు రెండూ ఎండిపోయి దవడలు ఎత్తుగా కని

పిస్తున్నాయి. కళ్ళు రెండూ మాత్రం మండుతున్నాయి ఎర్రగా. లిడుడ్మిల్లా రింగులు ఏరిపెడుతూఉంది. పాస్కా వెళ్ళడంతోనే ఆమె బుగ్గల నిగనిగ మాసి పోయినట్లయింది. చూపుల్లో బరువూ, ఎర్రటి పెదవులమీద మధుర రేఖా అలా అలా కనిపించినట్లయింది. ఆమె తండ్రి సులోచనాలు సర్దుకొని వెనక్కు చేరబడ్డాడు, చికాకుగా.

"క్షమించాలి నేస్తం, ఏదీనాకియ్యి! రింగులు వేస్తూఉన్న ఓకుర్రాణ్ణి ప్రక్కకు తోసేసి నిశ్చలమైన కంఠంతో అన్నాడు పాస్కా. ముసలాడి దిక్కుచూడకుండానే, అమ్మాయి దిక్కుచూసి తల విసిరాడు. యంత్రం బొమ్మలా రింగులు అందించింది లిడుడ్మిల్లా. మంచులా చల్లగా ఉన్న ఆమె వ్రేళ్ళు తాకాడు. బెంచీమీదికి డబ్బులు - రింగుల వెల విసిరి పడేశాడు.

వెనకాల జనం కమ్మలు కట్టడం మొదలు పెట్టారు.

"తోపుడు బండి పిలవండోయ్, ప్రయిజులు మోసుకువెళ్ళ డం కష్టం"

ఎవరేమన్నదీ వినిపించుకోకుండానే, నిర్లక్ష్యంగా గురి పెట్టి విసిరాడు రింగు. ఒక్కబాకూ కదలలేదు. టక్ మని శబ్దం మాత్రం అయింది. ఎక్కడా తగలకుండా వెళ్ళి బాకుకు వ్రేలాడింది రింగు. ముసలాడు తొందరగా అరచెయ్యిముక్కుకు పామాడు. భయపడ్డాడో ఏమో! మిఠాయి పొట్లం పాస్కా చేతికి అందించాడు. దాన్ని అవతల తోసేసి, కొంచెం వెనక్కు

తగ్గి మరోరింగు విసిరాడు పాస్కా, అదెక్కడికి వెళుతూ ఉందోకూడా చూడకుండా. అదీ సరిగ్గావెళ్ళి బాకు మీద వ్రేలాడింది. ముసలాడు మరో పొట్లం ఇవ్వబోతూ ఉండగానే, మరి మూడు రింగులు మూడుబాకుల మీదా విసిరి వేలాడ దీశాడు; కదలకండా, చప్పుడు లేకండా. జనం కిక్కురు మనకుండా చూస్తున్నారు. నిశ్శబ్దం, చీమచిటుకంటే వినిపిస్తుంది.

ముసలాడు చిలిపికళ్ళతో బిగులుగా చూస్తున్నాడు పాస్కాను. నల్లటి నుదుటిమీంచి చెమటబొట్లు దిగ జారుతున్నాయి. పంట్లాంవాడులైపోయినట్లుంది. ఓకాలు ముందుకు వేసి, కొంచెం క్రిందికి వంగి రింగుమీాద రింగు విసురుతున్నాడు పాస్కా. ఓటమి లేదు.

ప్రపంచాన్ని జయించిన వీరుడిలా నిలబడి ఉన్నాడు పాస్కా.

"ఏం, ఉడ్మిల్లా ఇపుడెవరి దంటూవ్ ?"

"నీది మాత్రం ఎప్పటికీ కాదు" అన్నాడు ముసలాడు.

"కాదు ? సరే" బరువు కళ్ళతో జనం దిక్కు తిరిగి ఓ కుర్రాణ్ణి చూసి అన్నాడు :

"ఒరే, అబ్బాయీ, మలుపు దగ్గరికి వెళ్ళి ఓ కూలాణ్ణో, ఓ తోపుడు బండీ పిలుచుకురా, ప్రయిజులు వేసుకు వెళదాం. ఏదీ, పరిగెత్తుకు వెళ్ళూ."

చెక్కు చెదరని దృఢత్వంతో ఉంది పాస్కా మొహం. నుదుటిమీది శిరాలు పొంగి బైటికి కనిపిస్తున్నాయి. ఓ

చెయ్యివెనక్కి మలిచాడు. వ్రేళ్ళకొనల్లో విద్యుత్తు మెరిసి నట్టుంది. బాకులు రింగులు వచ్చి వ్రేలాడుతూ ఉంటే బాకులు టంగ్ టంగ్ మంటున్నాయి. ప్రతీరింగూ బాకులు మీద వ్రేలాడుతూఉంది. ప్రజలు గొల్లుమంటున్నారు. సంతోషంతో గగ్గోలు చేస్తున్నారు. నిమిష నిమిషానికీ జనసమ్మర్దం పెరిగిపోతూ ఉంది. పాస్కా కళ్ళెత్తి చూడ్డం లేదు. తన లక్ష్యాన్ని కూడా పరీక్షించడం తనకు అనవసరం. ముసలాడు ఏమిచూస్తున్నాడో అతనికే తెలీదు. అర్థం కావడం లేదు. పాస్కాను చూడ్డానికే భయంగా ఉన్నట్టుంది. ఒక్క రింగుకూడా గురి తప్పడంలేదు. ఐదు నిమిషాల్లో అంతా అయి పోయింది. కమీజుచేత్తో నుదుటిచెమట తుడుచుకున్నాడు పాస్కా. జనం దారివదిలి తప్పుకున్నారు. తోపుడు బండి వచ్చేసింది.

"ఇవన్నీ బండిమీద వెయ్యి" ఆజ్ఞాపించాడు పాస్కా. "అయ్యో, అదేమిటి!" ప్రయిజు దొంతర్ల దిక్కుచూస్తూ నిస్సహాయుడిలా అన్నాడు ముసలాడు.

"ఏమీలేదు. ఈవస్తువులన్నీ గెలిచినవాడు పట్టుకవెళతాడు. ఇక్కడ మిగిలేదేమీ లేదు."

"అంటే ఏమన్నమాట? నాలుగు వందల రూబుల్సుల సామాను నాది. నాబ్రదుకంతా ఇదేను."

ఆడపిల్లలా ఏడుస్తున్నాడు ముసలాయన.

"ఏమైతే నాకేం? వెయ్యిరూబుల్సుల సామానైతే

మాత్రం! ఇదంతా నాది. నేను దొంగతనం చెయ్యలేదు. ఆటలో న్యాయంగా గెలుచుకున్నాను. కావలసినంత మంది సాక్షులున్నారు, ఈజనమంతా. చలికాలమంతా ఓ నిమిషం వ్యర్థం చెయ్యకుండా అభ్యాసం చేశాను. ఒక్కరాత్రి కూడా కును కెలాటిదో ఎరగను. ఎన్నిసార్లు నువ్వు ప్రయిజులు పెట్టినా, గెలుపునాదే. తప్పదు. ఈ సామానంతా నాఇష్టం. బుద్ధిపుడితే ఉంచుకుంటాను, లేదా నీళ్ళలో పారేస్తాను."

"తప్పకండా, వందసార్లయినా సరే మేమంతా సాక్ష్యం. ఐతే, నేస్తం, గ్రామఫోను మాత్రం నీట్లో పడెయ్యొద్దు" జనంలో నుంచి ఎవరో అన్నారు. పిలవకుండానే కొందరు వచ్చి ప్రయిజు సామానులు బండిలో వేశారు.

'పద' అన్నాడు పాస్కా.

ముసలాడు అరిచాడు: 'ఉండు. ఎక్కడికెళతావు? నేను మాత్రం ఉత్తి చేతుల్లో ఎలా ఇంటికి వెళ్ళేది?—నిజంగా ఇవి నీట్లో పడెయ్యకు."

"ఎందుకు పడెయ్యను? తప్పకండా పడేస్తాను. సరస్సు దగ్గిరికి రా చూద్దువుగాని."

"భగవంతుడి మొహమైనా కొంచెం చూడు."

"భగవంతుడు కాలిన బూడిదతో సమానం. అదిగో నీబోర్డుమీది చిలక పిట్టకీ భగవంతుడికీ ఏమీ తేడాలేదు. ఇదిగో మళ్ళీ యిలాంటి మాటలాడావా అంటే చూస్కో" అంటూ పిడికిలి చూపించాడు పాస్కా.

వెనకాల ఆనందంతో అరుస్తూ జనం, బండి వచ్చి సరస్సు దగ్గిర ఆగింది. క్రోములెదరు బూట్లజత తీసి నీట్లోకి గిరవా టేశాడు పాస్కా.

జనం గొల్లు మన్నారు.

" ఉండు " పిచ్చివాడిలా వగరుస్తూ అన్నాడు ముసలాడు :

" ఆగు "-

ప్రయిజులు కుప్పమీద రెండుచేతులూ గట్టిగా ఆనించి అన్నాడు పాస్కా.

" ఆఖరు సారి చెపుతున్నాను. ఇదే ఆఖరుసారి. వీళ్ళంతా సాక్ష్యం. ఆఖరుసారి చెపుతున్నాను. మీఅమ్మాయిని నా కిచ్చి పెళ్ళి చెయ్యి నీవస్తువులన్నీ తిరిగితీసి కెళిపో. నీపాక దిక్కు తిరిగి చూడ నన్నా చూడను. కాదంటావా, నిన్ను సర్వ్దుంబాలా చేసి వదుల్తాను. లిడుడ్‌మిల్లా లేకండా నేను బ్రదకలేను. నిమిషమన్నా బ్రదకలేను. "

" ఐతే, తీసి కెళ్లుదాన్ని, ఇదిగో కావాలంటే ఈక్షణంలో తీసి కెళిపో. "

ముసలాడు అరిచినట్లన్నాడు. కోపంతో క్రింద ఉమ్మేశాడు.

" లిడుడ్‌మిల్లా, నారాణీ ! "

గట్టిగా పిలిచాడు పాస్కా. సామాను బండి వదిలేసి పక్కకు వచ్చేశాడు. రెండుచేతులూ మొహంమీద కప్పు కొని ఎప్పుడో వచ్చి పక్కనే నిలబడి ఉంది లిడుడ్‌మిల్లా సిగ్గుతో. ఆమె బాహువులు కూడా సిగ్గుతో ఎర్ర బడ్డాయి.

"ఆట ఇవాళతో ఐపోయింది. పద"

నాజూకైన పింగాణీ వస్తువును తాకినట్టు, సున్నితంగా లిడుడ్మిల్లా మోచేయి పట్టుకున్నాడు పాస్కా.

సరిగ్గా అదే సమయానికి బులేవార్ అంతటా జాజిపువ్వులు గుబాళించాయి; ఎక్కడ చూస్తే అక్కడ సరస్సులో, శిరస్సులలో చెట్ల సందులలోంచి నీలి మఖమలు వంటి ఆకాశంమీద వంపు తీర్చినబాకు వలె నెలవంక. సరస్సులో, సరికొత్త ప్రతిబింబం. బంగారం ఉంగరంలా పెళ్ళి ఉంగరంలా, తరంగాల్లో రింగుల్లా ద్యోతకం అవుతూ ఉంది.

---

# నర్తకీ - చిత్రకారుడూ

చాలా పొద్దుపోయింది. జపాను యువక చిత్రకారుడొకడు కియోటోపట్నం నుండి యోదోకి కాలినడకని వెళుతున్నాడు, దారి నిర్జనంగావుంది. అదంతా కొండదారి. ఆ దినాల్లో దార్లు చాలావరకూ అష్టకష్టాలతో నిండి వుండేవి. అంచేత జపానులో ముద్దుగా పెరిగిన అబ్బాయిలికి బుద్ధి రావాలంటే వాళ్ళని సంచారానికి పంపాలి అనేవాళ్లు. రోడ్లమాట ఎలావున్నా దేశం ఆకారం మాత్రం ఆనాడూ ఇప్పటిలాగే వుండేది. ఇప్పటి లాగే పెద్ద పెద్ద అత్తి చెట్లవనాలూ, వెదురు అడవులూ వుండేవి. అప్పుడూ గడ్డితో నేసిన గుడిసెలూ వుండేవి. ఇవాళలాగే ధాన్యం పొలాల్లో గడ్డిటోపీలతో వ్యవసాయ దార్లు బురదలో నుంచుని పనిచేస్తూ వుండేవాళ్లు. ఇప్పటిలాగే రోడ్లప్రక్క వనాల్లో పెద్దపెద్ద బుద్ధ విగ్రహాలు ప్రశాంత మయిన చిరునవ్వులతో కనిపిస్తూ వుండేవి. నదీతీరాల్లో పల్లె టూళ్ళ కుర్రాళ్ళు ఇప్పుడులాగే దిస మొలలతో ఆడుకుంటూ వుండే వాళ్లు.

అయితే మన చిత్రకారయువకుడు 'ముద్దుగా పెరిగిన అబ్బాయి' కాడు. ఇంత స్వల్పవయస్సులోనే అతడు అనేక దేశాలు తిరిగాడు. దూర దూరాలు నడిచి వెళ్ళడంలో ఆ కష్టాలికి అలవాటు పడ్డాడు. కాని, ఈప్రయాణంలో అతడు సాయంకాల మయేసరికి వొక విషమప్రదేశంలో చిక్కు

పోయాడు. రాత్రి తల దాచుకుందా మంటే ఆ ప్రదేశంలో ఆశ్రయంలేదు. భోజనం దొరికే మార్గం అసలే కనిపించడం లేదు. అదంతా అడవిప్రదేశం మనిషివున్న గుర్తే కనిపించదు. దూరం తగ్గించడం కోసం అడ్డుదారి పట్టడం వల్ల, తప్పుదారిలో పడిపోయినట్టు అప్పటికి గాని అతడికి బోధపడలేదు.

అవి చీకటి రాత్రులు. అంతటా అత్తిచెట్ల అడివి చీకటిని మరింత గాఢం చేస్తూ వుంది. చెట్ల జీబులో గాలిచప్పుడు తప్ప మరో సడి వినపడడం లేదు. చిత్రకారుడు అలిసిపోతూ నడుస్తున్నాడు. ఏదన్నా నది కనపడు తుందేమో అని అతడి ఆశ. నది వొడ్డునే పడి వెళితే ఏదో వొక వూరు కనపడకపోదు. అనుకున్నట్టే వొక చిన్న కాలువ తగిలింది. దానివొడ్డుగుండా వెళ్ళాడతడు. కొంతదూరం వెళ్ళేసరికి అది వొక కొండమీంచి పడుతూన్న సెలపరై వూరుకుంది. పాపం అంత మేరా కాళ్ళీడ్చుకుంటూ వెనక్కి వచ్చా డతడు ఈసారి దగ్గరగావున్న ఒక గుట్టమీాద కెక్కాడు. దాని మీంచి నాలుగు దిక్కులా చూడవచ్చు. ఏదన్నా వూరు దగ్గరిగా వున్న గుర్తు ఏచిన్న దీపం వెలుగో కనపడవచ్చు. కాని అన్ని దిక్కులా పెద్ద పెద్ద కొండలు తప్ప మరేమీ కనపడలేదు.

మరో ఉపాయం లేదు. ఆరాత్రంతా ఆరుబయటే గడపా లతడు. ఇలా నిరాశ చేసుకున్న ఉత్తరక్షణంలో హటాత్తుగా వొకొండమూల, మినుకు మినుకుమంటూ వొచిన్న దీపం వెలుగు

తనకంట పడింది. ఎవరిదో వొక కుటీరంలోంచి ఆవెలుగు కనపడి వుంటుంది. ఈ ఆశతో అతడు ఆ వెలుగుదిక్కుగా నడిచాడు. కొంతదూరం వెళ్ళేసరికి నిజంగా వొక కుటీరం కనపడింది. వెళ్ళి ద్వారం ముందు నుంచున్నాడు. తలుపులు మూసివున్నాయి. ద్వారం సందులోంచి దీపం వెలుగు వచ్చి బైట పడుతోంది.

చిత్రకారుడు మెల్ల మెల్లగా తలుపు తట్టాడు. జవాబులేదు. పిలిచాడు. ఎవరూ పలకలేదు. గట్టిగా తలుపు కొట్టాడు. ఈ సారి లోపలనించి "ఎవరు? ఏం కావాలి?" అంటూ ప్రశ్న వచ్చింది. కంఠస్వరం స్త్రీది; ఎంతో మాధుర్యంగా వుంది. అన్నిటికంటె యువకుణ్ణి ఆశ్చర్యం కలిగించిన విషయం, ఆ కొండల్లో వుండి ఆమె పట్నవాసంలో శుద్ధమైన శిష్టవ్యావహారికం మాట్లాడడం.

తానొక విద్యార్థిననీ, యోదో వెళుతూ దారి తప్పి పోయాననీ చిత్రకారుడు జవాబు చెప్పాడు. ఆరాత్రికి కొంచెం భోజనం, పడుకుందికి కాస్తస్థలం కావాలంటూ ప్రార్థించాడు. ఇక్కడ ఆమాత్రం అవకాశం లేకపోతే ఏదయినా దగ్గిర గ్రామానికి దారి చూపించవలిసిందనీ ప్రార్థించాడు. దారి చూపించేవాళ్ళ పరిశ్రమా యిచ్చుకుంటానన్నాడు.

లోపలియువతి అతణ్ణి ఇంకా ఎన్నో ప్రశ్నలు వేసింది. బాటసారి ఎవడన్నా ఇలా ఇక్కడికి ఎలా రాగలడా అనే ఆమె ఆశ్చర్యం. కల్లా కపటం లేని అతడి జవాబు ఆమె సందే

హాం పోగొట్టింది. “ఇంత ఘోరమయిన ఈరాత్రి వేళ వూరు వెదికి తెలుసుకోవడం సాధ్యంకానిపని. ఆగండి, తలుపు తీస్తాను” అందామె.

తలుపు తెరవబడింది. ఒక కాగితం లాంతరు పట్టుకొని ఇంటామె ద్వారంలో నిలబడింది. ఆమె లాంతరు ఎత్తి పట్టుకుంది. వెలుతురంతా యువకుడి మొహం మీద పడుతోంది. ఆమె దిక్కుమాత్రం చీకటిగావుంది. కావాలనే అలా లాంతరు పట్టుకుందామె. ఓనిమిషం మాట్లాడకుండా యువకుడి మొహం పరీక్షగా చూసింది. “ఆగండి నీళ్ళు పట్టుకువస్తాను” అంటూ లోపలికి వెళ్ళింది. క్షణంలో నీళ్ళతోనూ తువ్వాలుతోనూ తిరిగి వచ్చింది. కాళ్ళధూళి కడుక్కోమని కోరింది.

చిత్రకారుడు జోళ్ళుతీసి కాళ్ళు కడుక్కున్నాడు. ఇంటామె వెంట కుటీరం లోపలికి ప్రవేశించాడు. ఒక టేగది. వెనక ప్రక్క మాత్రం చిన్నవంటగది. అతడికోసం మాత్రమే వొక ఆసనం పరిచింది. కాళ్ళూ చేతులూ కాచుకుందికి కుంపటి దగ్గిర పెట్టింది.

చిత్రకారుడు యువతిని తేరిపార చూశాడు. అలౌకికమైన ఆమె సౌందర్యానికి చకితుడయాడు. అతడికంటె ఆమె వయస్సులో రెండు మూడేళ్ళ పెద్దకావచ్చు. అయినా ఆమె నిండు యవ్వనంతో నవనవలాడుతోంది. చూసీ చూడడంతోటే తెలిసిపోతుంది ఆమె కాపుపిల్ల కాదని.

"నేనిక్కడ వొక్కతెనే వుంటున్నాను" అందామె. ఆమె మాటల్లో తేనె లొలుకుతున్నాయి. "ఎవ్వరినీ ఇక్కడికి రానివ్వను. అయితే ఈచీకటి రాత్రిలో దారి నడవడానికి ప్రయత్నించారంటే మీకు ఆపద తప్పదు. కొద్ది దూరంలో వ్యవసాయదార్ల ఇళ్ళున్నాయి. కాని ఎవరయినా దారి చూపించందే మాత్రం అక్కడికి మీరు వెళ్ళలేరు. అంచేత ఈరాత్రి ఇక్కడే వుండండి. మీపడకకోసం పక్కయిస్తాను. భోజనం కూడా ఇస్తాను. పాపం, నిజానికి ఎంతో ఆకలిగా వుంటుంది మీకు. నాదగ్గిర బియ్యమూ, ఏవో కాయగూరలూ తప్ప మరేమీలేవు. మీరు చెడ్డగా భావించకండి" అంది.

చిత్రకారుడికి ఆకలి దహించుకు పోతోంది. ఆమాత్రం దొరకడమంటేనే బ్రహ్మానందంగావుంది. యువతి వంటింట్లోకి వెళ్ళింది. పొయ్యి ముట్టించింది. నిమిషాలమీద అన్నం కూరా తయారుచేసి పట్టుకువచ్చింది. ఆదరపూర్వకంగా వడ్డనా చేసింది. అతడు భోజనం చేస్తున్నంసేపూ మాట్లాడకుండా దగ్గిర కూచుంది. అతడు వేసిన ప్రశ్నలకి 'ఊఁ ఉఁ హూఁ' తప్ప మరో జవాబు ఆమెనుండి లేదు. చేసేదిలేక చిత్రకారుడూ వూరుకున్నాడు.

అతడు అలాగే కూచుని గది నాలుగుమూలలూ పరికించాడు. గది ఎంతో అంత పరిశుభ్రంగా వుంది. అతడికి వడ్డించిన పాత్రలూ తళతళా మెరుస్తున్నాయి. గదిలో విలువయిన వస్తువులు లేనే లేవు. వున్న వొకటీ రెండూమాత్రం

ఎంతో అందంగా వున్నాయి. గోడమీద బట్టలూ అవీపెట్టు కునే బీరువాల దగ్గిర తెల్లటి కాగితాల తెరలు వేలాడు తున్నాయి. వాటిమీద పువ్వులూ, లతలూ, కొండలూ, నదులూ, ఆకాశం, నక్షత్రాలూ — ఇలా ఎన్నో చిత్రాలు ఎంతో అందంగా వున్నాయి. గదివొకమూల కిందగా వొక వేదికవుంది. వేదికమీద చిన్నగుమ్మటం. దానికిలక్క పని చేసిన రెండు తలుపులు. అవి తెరచివున్నాయి. లోపల ఏదో వొక స్మృతిచిహ్నం కనిపిస్తూ వుంది. రెండు పక్కలా పువ్వులు కుప్పపోసి వున్నాయి. ఎదట వొక దీపం వెలు గుతూ ఉంది. పైన గోడమీద వొక అందమయిన చిత్రం వేలాడుతోంది. ఆచిత్రం కరుణ దేవతది. దానితలమీద నెలవంక కిరీటంలా ఎంతో ఇదిగా వుంది.

చిత్రకారుడి భోజనం ముగిసింది. "మీాకు పక్కకూడా మంచిది ఏర్పరచ లేను" అందామె "దోమ తెరకూడా కాగి తంది. వీటితోనే ఈ రాత్రి మీారు విశ్రాంతి తీసుకోవాలి. పక్కనాదే. ఈరాత్రి ఎంతోపని చెయ్యాలినేను. నిద్రకి నాకు అవకాశం లేదు" అంది.

'దేవకన్నెలాంటి ఈ అందకత్తె ఏదో వొక తెలీని కార ణంవల్ల ఇలా వొంటరిగా ఈ ఆరణ్యంలో గడుపుతోంది' అంటూ అవగాహన చేసుకున్నాడు చిత్రకారుడు. అతిధిని సత్కరించాలన్న అభిప్రాయంతోనే ఆమె తన పక్క తనకి ఇస్తున్నదనీ, అందుకోసం రాత్రంతా తనకేదో పనివుందని

స్తాకు చెప్పుతున్నదనీ అతడు భావించాడు. అంచేత ఆమె చెప్పిన దానికి అతడు సమ్మతించలేదు. "నాకోసం మీరు ఇంత శ్రమపడడం అనవసరం. నేలమీద చిన్న చాప అయితే నాకు చాలు. సుఖంగా నిద్రపోతాను. ఏదో రెండుమూడు దోమలు కుట్టినా అంత ప్రమాదమేమీలేదు" అంటూ నిరాకరించాడు. కాని ఆమె ఒప్పుకోలేదు. తమ్ముణ్ణి ఒప్పించే అక్కయ్యలాగ కాదుగాక కాదని అతణ్ణి ఒప్పించింది. మరి కాదనలేక పోయాడు చిత్రకారుడు. నిజానికి ఆరాత్రి ఎంతో పనివుంది ఆమెకి. అందుకని వీలయినంత వేగంగా ఆమెకి అవకాశం కావాలి. ఇంకోమాట చెప్పకుండా చిత్రకారుడు ఆమె చెప్పినట్టు వినకతీరిందికాదు.

ఒకే ఒక్కగది అని ముందే చెప్పాను. మంచంమీద ఆమె పక్క పరిచింది. దోమతెరా వేసింది. కర్రతలగడ తలవైపు పెట్టింది. తరవాత పల్చటి కర్రపలకలతో చేసిన ఒక తెరతెచ్చి మంచానికీ వేదికకీ మధ్య, వేదిక కనపడకుండా అడ్డుగా అమర్చింది. దాంతో చిత్రకారుడు గ్రహించాడు 'ఆమె ఒంటరిగా ఆచాటుని వుండడానికి నిశ్చయించుకుందని. మనస్సు ఒప్పడంలేదు; అయినా అతడు మంచంమీద పడుకోక తప్పిందికాదు. "ఈమెని ఇంత ఇబ్బంది పెట్టాను" అన్నభావం అతణ్ణి నిలువునా కరిగించి వేస్తున్నది. పక్కమీద వాలిన కొద్దిసేపట్లోకే అతడు గాఢనిద్రలో మునిగిపోయాడు. కొద్దిగంటలు గడిచాయోలేదో, పాటా

త్తుగా అతడు తుళ్ళిపడి లేచాడు. ఆశ్చర్యం! ఏదో తెలియరాని శబ్దం వినిపిస్తోంది. అది మనుష్యుల కాలిచప్పుడే కాని, నడిస్తే పరిగెడితే అయేచప్పుడులాలేదు. ఎవళ్ళయినా ఉద్రేకంతో చిందులు తొక్కుతూ, కాళ్ళు ఇటూ అటూ విసిరితే ఎల్లాంటి చప్పుడు అవుతుందో అలాంటిదా చప్పుడు. దొంగలయి వుంటారు. అతడి గుండెలు దడదడలాడాయి. అయితే, ఆభయం తనకోసం కాదు. తనదగ్గిర దొంగలు దోచుకోవలిసినంత ఏమీలేదు. ఆ దయామూర్తి ఇంటామె కోసమే అతడి దడ. లేచి కూచున్నాడు. కాగితం దోమతెర సందుల్లోంచి చూశాడు. కాని కర్రపలకల తెరఅడ్డంగా వుంది. అవతల ఏం జరుగుతున్నదీ కనపడడం లేదు. పెద్ద కేక వేద్దామనుకున్నాడు. కాని సంగతేమిటో తెలుసుకోకండా ఏంచేసీ ఏమీ లాభంలేదనుకున్నాడు. ఆగకండా ఆశబ్దం అలా వినపడుతూనేవుంది. వింటూన్నకొద్దీ మరీ అగమ్యగోచరంగావుంది. ఏమయినా ఆమెని రక్షించాలి తన ప్రాణం పోయినాసరే.

దోమతెర తొలగించి అతడు మంచంమీంచి దిగాడు. చప్పుడు లేకండా నెమ్మదిగా అడుగులు వేస్తూ కర్రతెరదగ్గిరికి వచ్చాడు. తెరపక్కనించి చూశాడు. తనకళ్ళముందు కనపడ్డ దృశ్యానికి నిలువునా నిశ్చేష్టుడై పోయాడు. తనకళ్ళనే తాను నమ్మలేకపోయాడు. విలువయిన దుస్తులు వేసుకుని ఇంటామె వొంటరిగా వేదికముందు నాట్యం చేస్తోంది. దుస్తులు జిగేలుమంటున్నాయి కళ్ళకి. అవి ఆలయాల్లోని నాట్యకత్తెల

దుస్తులులా వున్నాయి. ఇంతవిలువయిన దుస్తులు వేసుకున్న ఏనాట్యకత్తెనీ ఇంతవరకూ మన చిత్రకారుడు ఎక్కడా చూడలేదు. ఆ అందమైన దుస్తులలో ఆమె అందం అద్భుతంగా వుంది. ఆమె అందాన్నిమించి ఆమె నృత్యం అతణ్ణి మరింత చకితుణ్ణి చేస్తోంది. మొట్టమొదట అతడి మనస్సులో భయం తలసూపింది. ఎవరీమె? దెయ్యమో దేవతో కాదు కదా! ఉహూఁ, కాదు. కరుణదేవత చిత్రం ఎదట, బుద్ధదేవుడి వేదికముందు ఆమె నృత్యం చేస్తున్నది. మెరుపులా తట్టిన భయం మెరుపులాగే మాయమైంది. అలా భయపడ్డందుకే అతడు సిగ్గుపడి పోయాడు. నొచ్చుకున్నాడు.

ఆమె నాట్యం ఇంకొకన్నువాడు చూడకూడదనే ఆమె సంకల్పం. ఆవిషయం చిత్రకారుడికి అర్థమైంది. అతడు ఆమె అతిథి. వెంటనే అతడు పక్కమీదికి, దోమతెరలోకి వెళ్ళిపోవడం న్యాయం. కాని అతడు ఇంద్రజాలంలో వున్నట్టున్నాడు. ఆశ్చర్యం, ఆనందం అతణ్ణి స్తంభింపంజేశాయి. ఇలాంటినృత్యం అతడు జన్మలో చూసి ఎరగడు. చూస్తున్న కొద్దీ అతణ్ణి సమ్మోహంలో ముంచెత్తుతున్నది ఆమె నృత్యం. హటాత్తుగా ఆమె ఆగింది. తన దుస్తులు తీసివెయ్యడం కోసం వెనక్కి తిరిగేసరికి చిత్రకారుణ్ణి చూసింది. తుళ్ళిపడింది.

చిత్రకారుడు తన తప్పుకోసం క్షమాపణ వేడడం మొదలుపెట్టాడు. అడుగుల చప్పుడుతో తన నిద్ర తేలిపోయిందనీ, భయంతో లేచిపోయాననీ, ఆ భయం తనకోసం కాదనీ,

అడవిలో వొంటరిగా నివసిస్తూవున్న ఆమె కోసమేనసీ అతడు చెప్పాడు. తీరా మంచం దిగివచ్చి అతడు చూశాక తనకి కలిగిన ఆశ్చర్యం కూడా దాపరికం లేకండా తెలియజేశాడు. "మిమ్మల్ని ప్రశ్నించినందుకు నన్ను క్షమించాలి. నేను తెలుసుకోవాలని కోరుతున్నాను. మీ రెవరు? అద్భుతమైన ఈ నృత్యం ఎక్కడ నేర్చుకున్నారు? పట్నంలోని సుప్రసిద్ధ నాట్యకత్తెల అందరి నృత్యమూ చూశాను నేను. కాని, అందులో ఏవొక్క తేకూడా మీఅంత గొప్పగా నృత్యం చెయ్యలేదు. మీ నృత్యం మీద నాచూపు పడిం తరవాత నేను మరి వెవక్కి వెళ్ళలేక పోయాను" అన్నాడు.

మొదట ఆమెకి పట్టరాని కోపం వచ్చింది. కాని కల్లా కపటం లేకండా చిత్రకారుడు చెపుతూవున్న మాటలతో క్రమంగా ఆమె మొహంనించి కోపభావం చెరిగి పోతూ వచ్చింది. చిరునవ్వుతో అతడిముం దామె చదికిల బడింది. "మీ మీద నాకు కోపంలేదు. అయితే, మీరు నానృత్యం చూసేశారు. అందుకనే కష్టంగాఉందినాకు. ఒంటరిగా నేనలా నృత్యం చెయ్యడం చూసి బహుశా మీరు నన్ను పిచ్చి దను కుని వుంటారు. అంచేత నావిషయం మీకు చెప్పడం అవ సరం."

ఆమె తనకథ ఆరంభించింది. చిత్రకారుడికి జ్ఞాపకం వచ్చింది; తన చిన్నప్పుడు ఆమెపేరు విన్నాడు. అప్పుడామె పట్నంలోని నాట్యకత్తె లందరినీ మించిన నాట్యకత్తెగా వుం

డేది. మహారాజసంపత్తి ఆమె పాదాల కిందపడి వుండేది. ఆమె అందంముందు ప్రపంచం తల వొగ్గేది. ఐతే ఒకనాడు అన్నిటినీ వొదిలి హాటాత్తుగా ఆమె ఎక్కడికో మాయమై పోయింది. అవాళనుండీ ఆమె ఫికరు తెలియడం లేదు. ఆమెతో వొక యువకుడుకూడా మాయమైపోయాడు. ఆయువకుడు ఆమె ప్రియుడు. యువకుడి దగ్గిర ఆస్తిపాస్తి ఏమీలేదు. నర్తకి దగ్గిరవున్న దాంతోనే కొండలకి పోయి అక్కడ కుటీరం కట్టుకుని ఆ యిద్దరూ కాపరం పెట్టారు. ఉభయులూ వొకళ్ళ కొకళ్లు తప్ప మరోప్రపంచం తెలీదు వాళ్ళకి. యువకుడు ప్రాణంపెట్టి ఆమెని ప్రేమించాడు. ఆమె నృత్యం చూడడమే అతడికి బ్రహ్మానందం. సాయంకాలం కావడమే తడువు, తనకి నచ్చిన రాగం అతడు వాయిస్తాడు. ఆ రాగం తాళంమీద ఆమె నాట్యం ప్రారంభిస్తుంది.

ఇలావుండగా చలికాలంలో జబ్బుచేసి అతడు హాటాత్తుగా చచ్చిపోయాడు. ప్రాణంపెట్టి అతడి జబ్బులో ఆమె ఎంతన్నా సేవచేసింది. అయినా అతణ్ణి దక్కించుకోలేక పోయింది. అప్పటినుంచీ ఆయువకుడి స్మృతినిలుపుకుంటూ అతడిపూజ చేస్తూ ఆమె జీవితంగడుపుతోంది. పగలంతా అతడిస్మృతి చిహ్నం దగ్గిర పువ్వులు పరుస్తుంది. దీపం తీర్చి పెడుతుంది. రాత్రికాగానే అతడు బతికి వున్నప్పటి మోస్తరుగా ఎదట నాట్యం చేస్తుంది. అలిసివున్న చిత్రకారుడి నిద్రభంగం చెయ్యడం ఆమెకి ఇష్టం లేదు. అందుచేత మెల్లమెల్లగానే

అడుగులు వేసింది. అయినా నిద్రాభంగం కలిగించింది. దాని కని క్షమాపణకూడా వేడిందామె.

తరవాత లేచి టీ తయారు చేసిం దామె. ఆమెతో కలిసి చిత్రకారుడూ టీ తాగాడు. టీ తాగాక ఆమె బలవంతం మీద పక్కమీదికి వెళ్ళి శరీరం వాల్చా డతడు. కొద్ది సేపట్లోకే మళ్ళీ గాఢనిద్రలో మునిగిపోయాడు. తెల్లవారి లేచాక అతడికి ఆకలిగానే వుంది. అప్పటికే ఆమె అతడి కోసం భోజనం సిద్ధంచేసి వుంచింది. ఈ భోజనమూ రాత్రి లాగే సాదాగానే వుంది. ఎంతో ఆకలిగా వున్నా కడుపు నిండా తినడానికి అతడు సంకోచపడ్డాడు. బహుశా ఆమెకోసం ఏమీ వుంచుకో లేదేమో ఆమె!

అతడు వెళ్ళేముందు తనకిచ్చిన భోజనానికని కొంత పైకం ఆమె కివ్వాలని ప్రయత్నించాడు. ఆమెపుచ్చుకోలేదు. "నేను మీకిచ్చిన భోజనం అతి సామాన్యమైంది. నిజానికి దానికి విలువే లేదు. అదీ కాక అసలు డబ్బుకని మీకు భోజనం పెట్టలేదు నేను. అతిథికి చూపవలసిన సామాన్యకర్తవ్యమే నేను నిర్వహించాను. ఇక్కడ మీకు ఇబ్బందీ కలిగింది. అవన్నీ మరిచిపోయి మీసదుపాయం కోసం నేను చూపించిన శ్రద్ధమాత్రం మీరు జ్ఞాపకం వుంచుకుంటే చాలు. నేను ధన్యురాలినే అవుతాను" అంది.

ఇంకోసారి డబ్బు ఇవ్వడానికి అతడు ప్రయత్నించాడు. అన్నిసార్లు అతడు డబ్బు ఇవ్వబోవడం ఆమెకి కష్టంగావుంది.

చేసేదిలేక కేవలం మాటలతోనే తనకృతజ్ఞత తెలియజేసి, ఆమె శెలవు తీసుకున్నాడు చిత్రకారుడు. అతడి మనస్సు మాత్రం అక్కడినించి కదలడం లేదు. కాళ్ళు ముందుకి సాగడం లేదు. ఆమె అందం — అందాన్నిమించిన గుణం— అతణ్ణి ముగ్ధుణ్ణి చేసివేశాయి. అతడు వెళ్ళవలసిన దారి ఆమె వివరాలతో చెప్పింది. అతడు కనపడేవరకూ ద్వారం దగ్గిరే చూస్తూ నుంచుంది.

ఒక గంట నడిచాక తనకి తెలిసిన రోడ్డుమీదికి వచ్చాడు చిత్రకారుడు. హటాత్తుగా జ్ఞాపకం వచ్చిం దతడికి. నర్తకితో తనపేరు చెప్పడం మరిచిపోయాడు. వెంటనే అనుకున్నాడు. చెప్పి మాత్రం ప్రయోజన మేముంది? బహుశా బతికి నన్నాళ్ళూ నేను బీదవాణ్ణిగానే వుండిపోతానేమో!” అని.

ఎన్నో ఏళ్ళు గడచిపోయాయి. ఎన్నో చట్టాలు మారి పోయాయి. ఎన్నో కొత్తకొత్త పద్ధతులు పుట్టాయి. చిత్ర కారుడు ముసిలయి పోయాడు. అంతేకాదు ఈలోగా అతడు ఎంతో కీర్తి సంపాదించాడు. ఎన్నో సన్మానాలు పొందాడు. అద్వితీయమయిన అతడి చిత్రాలికి ముగ్ధులై ధనవంతులు అతడు అడగకండానే ధనరాసులు అతడికి అర్పించారు. అత డిపుడు బీదవాడుకాడు. ధనవంతుల్లో ధనవంతుడు. పట్నంలో వొక మంచి భవనంలో ఇపు డతడి కాపరం. జపానులోని దూరదూర ప్రాంతాలనించి యువక చిత్రకారు లతడి దగ్గిర చిత్రకళ నేర్చుకోవడానికి వస్తున్నారు. వాళ్ళు

అతడిదగ్గిరే వుండి అతడిసేవ చేస్తూ కళాభ్యాసం చేస్తున్నారు. అతడి పేరు జపానంతటా మారుమోగుతోంది.

ఒకనాడు వొక ముసిల్ది చిత్రకారుడి భవనం దగ్గిరికి వచ్చి అతణ్ణి కలవాలనికోరింది. ఆమె చింకిగుడ్డలూ, జీర్ణావస్త్రా చూసి ఆమెఏదో వీధినిపోయే ముష్టిది అనుకున్నారు. నౌకర్లు. "ఏం, ఏం కావాలి?" అంటూ కసిరారు. "ఏం కావాలో అది మీయజమానితో గాని చెప్పను" అంది ముసిల్ది. అది పిచ్చిదే అని నిశ్చయించారు నౌకర్లు. 'యజమానిలేరు ఎపుడువస్తారో తెలీదు. వెళ్లు' అంటూ ఆమెని తరిమి వేశారు. మర్నాడు మళ్ళీ వచ్చిందామె. మళ్ళీ అలాగే తరిమే శారు నౌకర్లు. అలా ప్రతీదినం ఆమె వస్తూనే వుంది. వారాల తరబడి రోజూవస్తూనే వుంది. ప్రతీసారీ నౌకర్లు ఆమెని తరిమేస్తూనే వున్నారు. ఇవాళ చిత్రకారుడి వొంట్లో బాగుండ లేదనీ, ఇవాళ స్నేహితుల యింటికి విందుకి వెళ్ళారనీ ఇలా ఏదో సాకు చెపుతూనే వున్నారు. అయినా ఆమె వస్తూనే వుంది.

చివరికి ఆమె విషయం యజమానితో చెప్పడమే మంచి దనిపించింది నౌకర్లకి. ఆయనదగ్గిరికి వెళ్ళి చెప్పనూ చెప్పారు వాళ్ళు. "బయటగేటు దగ్గిర వొక ముసిల్ది తమకోసం కాసుకు కూచుంది. బిచ్చకత్తెలాగేవుంది. ఇవాళకి సుమారు రెండు నెల్లయి రోజూ వస్తూవుంది. ఆమె వచ్చిన కారణం తమతో తప్ప ఎవరితోనూ చెప్పనంటుంది. అది పిచ్చిదని తరుముతూ

వచ్చాము. అయినా రోజూ వస్తూనే వుంది. అంచేత ఈ విషయం తమతో చెప్పడం మంచిదని చెప్పాము. సెల విప్వండి. ఏం చెయ్యమంటారు ?" అన్నారు.

చిత్రకారుడు చిరాకు పడ్డాడు వాళ్ళని "ముందే ఈమాట చెప్పారు కాదేం ?" అంటూ. వెంటనే వచ్చి, ఆమెని గౌరవంగా లోపలికి రమ్మన్నాడు. లోగడ తాను బీదవాడిగా వున్న సంగతి అతడెపుడూ మరిచిపోలేదు. "మీ కేం కావాలి ?" అంటూ ఆమెని అడిగాడు. తనకి భోజనం కాని, డబ్బుకాని ఏమీ అక్కరలేదంది ముసిల్ది. తనకోసం వొక చిత్రం మాత్రం అతడు రాసి పెడితే చాలు. ఇదే తన ప్రార్థన అంటూ నెమ్మదిగా చెప్పిం దామె. తేరిపార చూశాడు చిత్ర కారుడు. 'సరే,' అంటూ లోపలికి రమ్మన్నాడు. అతడి వెంట లోపలికి నడిచిం దామె. గదిలోకి వెళ్ళేక మోకాళ్ళ మీద చతికిలబడి తన మూట విప్పడం మొదలు పెట్టింది. మూటలో నాట్యకత్తె దుస్తులు చూశాడు చిత్రకారుడు. అవి ఎంతో పాతవి. చిరిగిపోయి వున్నాయి. రంగుకూడా మాసి పోయింది. కాని, వాటిని చూస్తే మాత్రం వొకనాడవి ఎంతో అందంగా వుండేవనీ, విలువయినవనీ తెలుస్తూనేవుంది.

ముసిల్ది దుస్తులు తీసి బైట పెడుతూ వుంది. చిత్రకారుడి హృదయంలో ఏదో ఏదోలా అనిపిస్తూ వుంది. అతడేదో జ్ఞాపకం చేసుకుంటున్నట్టున్నాడు. కాని జ్ఞాపకం రావడం

లేదు. ఉండివుండి వొక్కసారి చప్పున అతడికి అంతా జ్ఞాపకం వచ్చింది. తన కళ్ళముందు అతడికి ఆకొండమీాది చిన్న కుటీరం కనపడింది. అందులో అత డొకనాడు ఎంతో ఆదరసత్కారాలు పొందాడు. ఆ చిన్న కుటీరంలో ఆగది, కాగితం దోమతెరా, పూజా వేదికా, అర్ధరాత్రి ఆ అందక త్తె నర్తకి వొంటరినృత్యం — అన్నీ అతడికళ్ళముందు నిన్నటి మాటలా కనిపిస్తున్నాయి. నిలువునా అతడు ఇదయిపోయాడు. ముసలామె ఎదుట చప్పున సాష్టాంగపడ్డాడు. "మిమ్మల్ని ఇంతవరకూ పోల్చలేకపోయాను. నా అపరాధం క్షమించండి. ఇవాళకి సుమారు నలభై సంవత్సరాలు గతించాయి. అంచేత ఈ పొరపాటు జరిగింది. ఇపుడు మిమ్మల్ని బాగానే పోల్చు కున్నాను. మీారు మీాఇంట ఎంతో ఆదరపూర్వకంగా ఆశ్రయమిచ్చారు నాకు. మీాపక్క కూడా నాకోసం వొది లేశారు. నేను మీా నృత్యం చూశాను. మీా కథకూడా విన్నాను. మీాపేరు నేనెప్పుడూ మరిచిపోలేను" అన్నాడు.

అతడి మాటలు విని ముసిల్ది నిచ్చెర పోయింది. సంకో చించిందికూడా. ఏమనాలో ఆమెకి తోచలేదు మొదట. వృద్ధాప్యంవల్లా పేదరికంలోని దైన్యత్వం వల్లా ఆమె జ్ఞాపక శక్తి మందగించింది. చిత్రకారుడు నెమ్మదిగా ఎన్నో మాటలు చెప్పినమీాదటా, తనపాతకుటీరం వర్ణించిన మీాదటా గడిచిన దినాలు ఆమెకి జ్ఞాపకం వచ్చాయి. దేవుడి నన్నిక్కడికి దారి చూపించి తీసుకు వచ్చాడు. పవిత్రమయిన మీా పాదధూళి

నాకుటీరంలో పడ్డప్పుడు నేనిలా లేను. బుద్ధభగవానుడి దయ వల్ల మీరే నన్ను పోల్చారు" అందామె.

తరవాత తన దుఃఖగాథ వినిపించిందామె. చిత్రకారుడు అవాళ వచ్చేసినతరవాత ఆమెస్థితి చెడింది. తప్పనిసరిగా ఆమె తన కుటీరం అమ్మేసి పట్నంలోకి వచ్చెయ్యవలసి వచ్చింది. పట్నంలో ఆమె పేరు కూడా మరిచిపోయారు జనం. కొండ మీదికుటీరం వొదిలి రావడంలో ఆమె ఎంతో దుఃఖపడింది. వార్థక్యం వల్లా, శక్తి తక్కు-తగ్గి పోవడం వల్లా వేదికముందు నృత్య చేసేసామర్థ్యం పోయిందని ఆమె దుఃఖంతో కుంగిపోయింది. తనప్రియుడి ఆత్మతో ఇది కొత్తగా వచ్చిన వియోగమని పించింది. ఆమె దుస్తులతో, నాట్యాకత్తె వేషంలో, భావభంగిమతో నాట్యం చేస్తూన్నట్టు వొక చిత్రం ఆమెకి కావాలిపుడు. ఆచిత్రం వేదికదగ్గిర వేలాడ గడుతుందామె. ఈకోర్కి తీర్చవలసిందని ఆమె ప్రార్థన. ఈపనికోసం సాధారచిత్రకారు లెవ్వరిదగ్గిరికి వెళ్ళకండా చిత్రకళా చక్రవర్తి దగ్గిరికే వచ్చిందామె. ఏమంటే తనచిత్రం ఉత్తమమైంది కావాలంటే ఉత్తమచిత్రకారుడే అది చిత్రించాలి. చిత్రం కోసమే ఆమె తన నృత్యం దుస్తులూ వెంటమూట గట్టుకు వచ్చింది. అవి ఆమె వేసుకుంటే చిత్రకారుడు చిత్రం రాయడం సులువవుతుంది.

ఆమె మాటలువిని చిత్రకారుడు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు: "మీరు ఎలాంటి చిత్రం కావాలంటున్నారో అలాంటి చిత్రమే నేను సంతోషంగా తప్పకండా తయారు

చేసి ఇస్తాను. ఇవాళనేను తీరిక లేకండా వున్నాను. ఇవేళ నేనోక పనిపూర్తి చెయ్యాలి. రేపు మీరురండి. నాశక్తివంచన లేకండా మీచిత్రం ప్రారంభిస్తాను."

"ఐతే వొకమాట మాత్రం మీకు చెప్పాలి" అంది ముసిల్ది. "చెప్పడానికి సంకోచంగానూ వుంది. మీ కష్టానికి నేనే మీ బహుమానం ఇవ్వలేను. ఈదుస్తులుతప్ప నాదగ్గిర మరేమీ లేదు. ఇవి మాత్రం మీకివ్వగలను. ఒకప్పుడు ఎంతో ఖరీదయినవే అయినా ఇప్పుడు చిరిగిపోయాయి. రంగు నహా మాసిపోయింది. అయినా మీరివిపుచ్చుకుంటారనే ఆశిస్తాను. ఏమంటే పురాతన వస్తువులన్న దృష్టితో వీటికి విలువలేక పోదు. ఈనాటి ఆధునిక నాట్యకత్తెలు ఈరకం దుస్తులు ధరించడంలేదు మరి" అంది.

"ఆవిషయం మీరేమీ ఆలోచించకండి" అన్నాడు చిత్రకారుడు. నాకర్తవ్యం నేను నెరవేరుస్తాను. అదేనాకు పదివేలు. రేపు తప్పకుండా మీచిత్రం ఆరంభిస్తాను" అన్నాడు.

ముసిల్ది ముమ్మారు వంగి చిత్రకారుడికి నమస్కరించింది. "క్షమించాలి నేను మరేమీ చెప్పవలసింది లేదు. అయితే మీరిప్పుడు నన్ను చూస్తున్న నారూపంలో నాచిత్రం చిత్రించవద్దు. లోగడ మీరు నన్ను ఎలాచూశారో అప్పటి నా రూపం చిత్రించాలని నా అభిలాష" అంది.

"నాకుబాగా జ్ఞాపకం వుంది. మీరపుడు దేవకన్యలా వుండేవారు" అన్నాడు చిత్రకారుడు. కృతజ్ఞతా సూచకంగా

మరోసారి నమస్కరించిందామె. "ఏదేవి మిమ్మల్ని కోరానో అవన్నీ లభిస్తాయన్న మాట! అప్పటి నారూపం మీకు జ్ఞాపకం వుంది. కనక అప్పటి నారూపమే చిత్రించండి. దయచేసి నాయవ్వనమూ, సౌందర్యమూ తిరిగి ఇప్పించండి. అప్పుడే పరలోకంలో వున్న అతడి ఆత్మకి సంతోషం కలిగించ గలుగుతాను. అతడికోసమే నేనిలా బిచ్చమెత్తుతున్నాను. మీరు చిత్రించిన చిత్రంచూచి అతడు నాపొరపాట్లు క్షమిస్తాడు"అంది.

చిత్రకారు డామెని వోదారుస్తూ అన్నాడు: "మీరు నిశ్చింతగా వుండండి రేపురండి. అందమయిన ఆనాటి నర్తకి రూపంలోనే మీచిత్రం చిత్రిస్తాను. మనజపాను దేశంలోని మహారాజు చిత్రం చిత్రించడంలో ఎంతశ్రద్ధవహిస్తానో అంతకంటే అధికం శ్రద్ధ మీచిత్రం చిత్రించడంలో వహిస్తాను. సందేహించకండి. రేపు తప్పకరండి"

ముసిల్ది మర్నాడు అన్నవేళకి వచ్చింది. చిత్రకారుడు తెల్లటి సిల్కుమీద చిత్రం చిత్రించడం ప్రారంభించాడు. అతడి శిష్యులు వృద్ధురాలిని ఎలాచూస్తూన్నారో అలాలేదా చిత్రం. చిత్రంలోవున్న వ్యక్తికళ్లు లేడిపిల్ల కళ్ళలా మిలమిలలాడిపోతున్నాయి. శరీరం చివురు పెడుతున్న పూలతీగలా వుంది. దుస్తులు బంగారం వన్నెతో మెరిసి పోతున్నాయి. ఆమె అప్సరసలావుంది. సమ్మోహనమూర్తిలా వుంది. చిత్రకారుడి కుంచెయొక్క ఇంద్రజాలంవల్ల వృద్ధురాలి యవ్వనం, సౌందర్యం మళ్ళీ తిరిగి వచ్చాయి. చిత్రకారుడు చిత్రం పూర్తి

చేశాడు. చిత్రంలో తనపేరూ రాశాడు. ముతకసిల్కు మీద అది అతికాడు. చందనంకర్రా, ఏనుగుదంతం చట్రం దానికి తగిలించాడు. వేలాడదీయడానికి పట్టుతాడూ తగిలించడం కూడా అతడు మరిచిపోలేదు. తరవాత తెల్లటి కర్రపెట్టెలో అది భద్రంగాపెట్టి వృద్ధురాలికి బహూకరించాడు. ఆమెకి కొంతధనం కూడా ఇవ్వాలని అత డభిలషించాడు. కాని ఎంత బలవంత పెట్టినా ఆమె అంగీకరించలేదు. కళ్ళనీళ్ళు పెట్టు కుంటూ ఆమె అంది; "నమ్మండి డబ్బునాకు ఏమాత్రం అవసరం లేదు. కేవలం ఈచిత్రంకోసమే నేను దేవుడిముందు మోకరించాను; ప్రార్థించాను. నా ప్రార్థన ఫలించింది. ఈ జీవితంలో మరే కోరికాలేదు, నాకు. ఇలాగే ఏ కోరికా లేకండా నేను చచ్చిపోగలిగితే చాలు. నాకు నిర్వాణం లభి స్తుంది. ఈచింకి దుస్తులుతప్ప నాదగ్గిర మీకివ్వ దగింది మరేమీలేదు. ఈ వొక్కవిచారమే నన్ను బాధిస్తున్నది. అనుగ్రహించి ఇవి పుచ్చుకోండి. మీయూవజ్జీవమూ మిమ్మల్ని సుఖంగా వుంచాలని దేవుణ్ణి ప్రార్థిస్తాను. మీరు చూపిం చిన అనుగ్రహానికి సాటిలేదు."

చిత్రకారుడు చిరునవ్వు నవ్వాడు. "నన్నింత పొగడదగిన పని నే నేమీ చెయ్యలేదు. మీ దుస్తులు నేను పుచ్చుకోవ డమే మీకు సంతోషమయితే తప్పకుండా పుచ్చుకుంటాను. గడచిన దినాల తీయనిజ్ఞాపకాలు ఎన్నో నాహృదయంలో మేలుకుంటాయి. మీ రెక్కడవుంటున్నారో చెప్పండి. చిత్రం

గోడకి వేలాడ దీశాక నేను వచ్చి చూడగలుగుతాను” అన్నాడు. ఇలా అడగడంలో అతడి ఉద్దేశం, ఆమె ఉనికి తెలిశాక ఆమెకి సహాయం చెయ్యవచ్చని.

కాని ఎంతఅడిగినా ఆమె ఎక్కడవున్నదీ ఆమె చెప్పలేదు. ఎన్నో క్షమాపణాలు చెపుతూ అమె అన్నదల్లా ఆమె ఇల్లు ఎంతో అసహ్యమైదనీ, ఎంతోఇదిగావుటుందనీ మాత్రమే. చిత్రకారుడి వంటి గౌరవనీయులు ఆప్రాంతంలో అడుగుపెట్ట రాదనీ ఆమె అంటుంది. ఎన్నోవిధాలకృతజ్ఞత తెలుపుతూ ఆమె చివరికి అతడి సెలవు తీసుకుంది. చిత్రం పట్టుకుని వెళ్ళి పోయింది.

చిత్రకారుడు తన శిష్యుల్లో వొకణ్ణి పిలిచాడు. “ఇదిగో, ఈ ముసలామె వెనకాలేవెళ్ళు. ఆమె ఎక్కడ వుంటున్నదీ తెలుసుకొని వచ్చి చెప్పు. నువ్వు ఆమె వెంట వెళ్ళుతున్నట్టు ఆమెకి ఏమాత్రమూ తెలియనివ్వకూడదు” అంటూ చెప్పాడు.

శిష్యుడు వెంటనే బయద్దేరాడు. చాలసేపయాక తిరిగి వచ్చాడు. “ఆమెని అనుసరిస్తూ నేను పట్నంబయట నది వొడ్డునేపడి వెళ్ళాను. నేరం చేసినవాళ్ళని వధిస్తారే — అక్కడ విరిగిపడిపోతూవున్న వొక పాడుగుడిసెలో వుంటూవుంది ముసిల్ది. అది ఘోరమయిన ప్రదేశం. కంపుతో తల పగిలి పోతుంది. దెయ్యాలు భూతాలూ తప్ప అక్కడ మరోప్రాణి వుండడం అసంభవం” అంటూ చెప్పాడు.

"ఆప్రదేశం ఎలావున్నానరే, నన్ను రేపక్కడికి తీసుకు వెళ్లాలి నువ్వు. ఏమంటే నేను బతికివుండగా ఆమె తిండికీ గుడ్డకీ ఇబ్బంది పడకూడదు. ఆమె విషయం నేను ఆలోచించి తీరాలి. అన్నాడు చిత్రకారుడు.

శిష్యులు నిశ్చేరపోవడంచూచి ఆమె కథవారికి చెప్పాడతడు. దాంతో ఆమె అలావుండడం ఆశ్చర్యం లేదంటూ బోధపడింది వాళ్ళకి.

మర్నాడు ఉదయం, ఇంకా సూర్యోదయం కాలేదు. చిత్రకారుడూ అతడిశిష్యులూ పట్నంబయట నది వొడ్డున ఆఘోర మయిన ప్రదేశానికి వెళ్ళారు. సాధారణంగా సంఘంనుండి తరిమివేసిన వాళ్ళు నివసించే స్థల మది. గుడిసె ద్వారం మూసివుంది. చిత్రకారుడు ద్వారం తట్టాడు. జవాబు లేదు. పదేపదే తట్టాడు. లాభం లేకపోయింది. బలంగా తోశాడు. తలుపు విడిపోయింది. లోపల ప్రవేశించాలని కాలు ముందు పెట్టాడు. లోగడ కొండమీది కుటీరంలోని దృశ్యం జ్ఞాపకం వచ్చింది. లోపలికి వెళుతూనే అతడు చూశాడు; చింకిగుడ్డలతో చుట్టుకున్న వృద్ధురాలి శరీరం నేల మీద పడివుంది. కర్రగూడుమీద లోగడచూసిన చిన్న గుమ్మటంవుంది. దాన్లో స్మృతిచిహ్నం ఇప్పుడూ కనిపిస్తూ వుంది. అవాళలాగే ఇపుడూ దానిముందు దీపం వెలుగుతోంది అయితే కరుణదేవత చిత్రంమాత్రం అక్కడలేదు. దానికిబదులు చిత్రకారుడు చిత్రించిన నర్తకిచిత్రం గోడని వేలాడుతోంది.

గుడిసెలో చెప్పదగ్గ వస్తువంటూ మరేదీలేదు. కేవలం వొక సన్యాసిని దుస్తులూ, ఒక కర్రా, ఒక భిక్షాపాత్రికా మాత్ర మున్నాయి. నర్తకిపేరుపెట్టి చిత్రకారుడు నాలుగయిదుసార్లు పిలిచాడు. జవాబులేదు.

దాంతో తెలిసిపోయింది. ఆమెప్రాణంతో మరిలేదు. ఆమె దిక్కు చూశాడు చిత్రకారుడు. ఆమె తొలినాటి సౌందర్యం యవ్వనం ఆమె మొహంలో తిరిగివచ్చినట్టున్నాయి. మొహం లోంచి ముసిలిలక్షణాలూ, పేదరికం దీనావస్థా తొలిగిపోయి నట్టున్నాయి. చిత్రకారుడికంటే సిద్ధహస్తుడైన మహాచిత్ర కారుడి కుంచె ద్వారా ఈచిత్రం జరిగివుంటుంది అనుకుంటూ భారంగా తల వొంచుకున్నాడు.

---

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరము